# జమీన్ రైతు

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 8
28-3-1986
శుక్రవారం
16 పేజీలు: రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి


## ప్రధాని దయాభిక్షకు నాయకుల రాయబారం!

రాజ్యసభ ఎన్నికలు రాష్ట్ర కాంగ్రెసుపార్టీ పునాదులనే పెకలిస్తున్నాయి. ఏ నాయకుడి భవితవ్యం ఏమికానున్నదో తెలియని అనిశ్చితస్థితి నెలకొనివుంది. గాంధీభవన్‌లో ఎవరి ముఖం చూసినా ఒకరకమైన ఉద్విగ్నత. ఉద్వేగం తాండవిస్తున్నాయి.

క్రాస్ ఓటింగ్ నేరంలో ముద్దాయిల ఏరివేత పూర్తిచేసి, ఏ ఐ సి సి కార్యాలయంలో ఛార్జిషీటు దాఖలుచేసి, చేతులు దులుపుకున్నారు వెంగళరావు. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌వలె, ఈ ముద్దాయిలందరికి శిక్షవేసితీరాలని ఆయన వాదిస్తుంటే. డిఫెన్స్ న్యాయవాదిగా శ్రీ బాగా రెడ్డి రెండవప్రక్క రంగ ప్రవేశం చేశారు. ఇంకొకవైపు ముద్దాయిల నాయకుడుగా ముద్రపడిన డాక్టర్ వై ఎస్ రాజశేఖర రెడ్డ్యాదులు, తమపై చర్యతీసుకుంటే ప్రతీకారంగా పార్టీని రెండుముక్కలు చేస్తామని బెదరిస్తున్నారు.

కాంగ్రెసుపార్టీ చరిత్రలో ఇటువంటి పరిస్థితి ఎదురుకావడం ఇదే ప్రథమం.

**హైదరాబాదు విలేఖరి**

ఎన్నో ఎన్నికలలో క్రాస్ ఓటింగ్‌లు జరిగినా, ఫలితాల తర్వాత ఆ సంగతి మర్చిపోవడం తప్ప, తప్పు చేసినవారిని వేలెత్తి చూపించడం ఇదే మొదలు. అందుకే ఇది పలువురు నాయకులకు మింగుడు పడడంలేదు.

క్రాస్ ఓటర్లపై చర్య తీసుకునే విషయంలో పార్టీలోనే భేదాభిప్రాయాలున్నాయి. అసలే రాష్ట్రంలో నామమాత్రా వశిష్టంగా వున్న కాంగ్రెసుపార్టీ బలం, 13 మంది శాసనసభ్యులను కోల్పోతే, మరీ శిథిలమై పోతుందని కొందరు భయపడుతున్నారు. పంచాయితీలు, మండలాలకు ఎన్నికలు రానున్న ఈ తరుణంలో తప్పొప్పులు ఎంచకుండా ప్రతి కాంగ్రెసు వాదినీ కలుపుకొని, తెలుగుదేశాన్ని సవాల్ చేయడం పిసిసి ధర్మమని. లేకుంటే సాధారణ ఎన్నికలలో వలెనే, ఈ సంస్థలనుకూడా ఎన్టీఆర్ చాపచుట్టుగా తీసుకపోతాడని వీరు భయపడుతున్నారు.

వెంగళరావు వాదన ఇంకొక రకంగా వుంది. ముఠా తగవులు, క్రాస్ ఓటింగులు, వెన్నుపోట్లవంటి "కుట్ల

—కొరవ 14వ పేజీలో

## రామనారాయణకి పదవీ యోగం?

బడ్జెట్ సమావేశాలు పూర్తికాగానే మంత్రివర్గ విస్తరణ జరగవచ్చునన్న ఊహాగానాలు, రాజధానిలో జోరుగా జరుగుతున్నాయి. తన మంత్రివర్గాన్ని విస్తరించడం లేదా సంస్కరించడంచేయాలనే తలంపు ఎన్టీఆర్‌లో చాలాకాలం నుంచి వుంది. మహానాడులో వెంకటేశ్వరరావు రచ్చచేయకుంటే, మూడునెలల క్రితమే జరిగిపోయివుండాల్సిందిది. ఆ దశలో మంత్రివర్గ విస్తరణ అంటే, తేనెతుట్టె కదిలించి నట్టవుతుందని ఎన్టీఆర్ భయపడ్డారు.

మంత్రివర్గంలో సగంమందిపై ఎన్టీఆర్‌కు సదభిప్రాయంలేదు. అయ్యన్నపాత్రుడివంటివారికి అసమర్థులని పేరుంటే, మహేంద్రనాథ్, ప్రతిభాభారతి ఇత్యాదులు అవినీతిపరులని ఆయనకు అనుమానం. అందువల్ల ఇటువంటివారినందరినీ తొలగించి, శాసనసభ్యులుగా తమ సమర్థతను రుజువుచేసుకున్న యువకులకు అవకాశమివ్వాలన్నది ఆయన సంకల్పం.

కొత్తగా కాబోయేమంత్రులని ప్రచారం జరుగుతున్న యువకులలో, రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఆనం రామనారాయణరెడ్డి

**మంత్రివర్గ విస్తరణ ఊహలు**

పేరుకూడా ప్రముఖంగా విన్పిస్తుంది. తెలుగుదేశం పార్టీ సంస్థాగత వ్యవహారాలలో ఇటీవల కాలంలో రామనారాయణరెడ్డికి తరచు ప్రమేయం. ప్రాధాన్యత లభిస్తున్నాయి. అసెంబ్లీలో ప్రభుత్వాన్ని సంకటపరిచే సమస్యలు ప్రస్తావనకు వచ్చినప్పుడల్లా, తెలుగుదేశం తరఫున ఆయనే మాట్లాడుతున్నారు. మొన్నటి

—కొరవ 14వ పేజీలో

# పేరు 'రక్షణ' - ఆచరణలో హక్కుల హరింపు

పాకిస్తాన్ విడాకులిచ్చిన భర్తపై భరణం కోసం సివిల్ కోర్టులో దావా చేసే హక్కు భార్యకు వుంది. ఈ హక్కు ముస్లిం స్త్రీలకు వుంటున్నది. ఇది సివిల్ కోర్టు ద్వారా పరిష్కారం పొందవలసిన విషయం కావడంవల్ల ఎక్కువ. ఖర్చు కూడా ఎక్కువే. అందువల్ల క్రిమినల్ కోర్టులో తక్కువ ఖర్చుతో భరణాన్ని పొందే హక్కు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ "488"వ సెక్షన్ కింద కల్పించబడింది. కాని సెక్షన్ క్రింద భరణాన్ని పొందే హక్కు భార్యకు మాత్రమే పరిమితం. గాని విడిపోయిన పత్నులను పొందే హక్కు ముస్లిం స్త్రీలకు కలుగజేయబడింది. ఈ విషయమై తన హక్కుకు భంగంకలిగే పక్షంలో మెజిస్ట్రేటుదగ్గర ఫిర్యాదు చేసే కొనే హక్కు ఇవ్వబడింది. ఈ హక్కు మొదటిసారిగా న్రమిస్తున్నామనే పై పద్దతులను కోరేహక్కు ఇతరులైన ముస్లిం పత్నులకు మొదటినుంచి వుండి జరిగిన మార్పు. ఇవి ఒక పద్ధతిలోమాత్రమే. ఇదివరకు సివిలు కోర్టుకు వెళ్ళవలసివుండేది. ఇప్పుడు క్రిమినల్ కోర్టును ఆశ్రయించవచ్చు. ఈమె

## షాబాను కేసు : ఒక పరిశీలన-2

★

శ్రీ పి. వి. రమణారెడ్డి

విడాకులు తీసుకున్న స్త్రీలకు ఆదిలేదు. ఆహక్కు వారికి మొదటిసారిగా 1974 లో అమలుకువచ్చిన నూతన క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ "125"వ సెక్షన్ ద్వారా ఇవ్వబడింది.

తన్నుతాను పోషించుకోలేని విడాకులు పొందిన భార్యను పోషించవలసిన బాధ్యత, ముస్లిములకు సైతం వుందని సుప్రీంకోర్టు షాబానో కేసులో ఇచ్చిన తీర్పును రద్దుచేయడం కోసం, కేంద్రప్రభుత్వం, "ముస్లిం మహిళల (విడాకుల, హక్కుల రక్షణ)బిల్లు"ను పార్లమెంటులో ప్రవేశపెట్టింది. ఈ బిల్లు శాసనమైతే విడాకులైన ముస్లిం స్త్రీలు క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్ 125వ సెక్షన్‌క్రింద పూర్వపు భర్తనుండి భరణాన్ని కోరే హక్కు రద్దవుతుంది. ఈబిల్లు ననుసరించి విడాకులతర్వాత తనకు రావలసిన "మహరు" ను, తనకు తనబంధువులుగాని, స్నేహితులుగాని, భర్తగాని, భర్త బంధువులు తన్నుతాను పోషించుకోలేని పరిస్థితిలో వున్నపుడు ఆమెను పోషించే బాధ్యత తనకు విడాకులిచ్చిన భర్తపైగాక, ఆమె బంధువులపై ఉంచబడింది. తనకు ఆస్తి ఉన్నపక్షంలో ఆమె మరణానంతరం ఆ ఆస్తి ఏబంధువులకు చెందుతుందో, వారికి ఆ మెను పోషించవలసిన బాధ్యత ఉంటుంది. ఆబాధ్యతను ఆమె ఆస్తి వారికి ఏనిష్పత్తిలో చెందుతుందో అదే నిష్పత్తిలో భరించవలసివుంటుంది. ఒక వేళ వారిలో ఎవరైనా ఆమెను పోషించలేని పరిస్థితిలో ఉన్నపుడు ఆమెను పోషించమని మిగతా బంధువులను ఆదేశించుటకు మేజిస్ట్రేటుకు అధికారం వుంటుంది. బంధువులు ఎవరూలేని పక్షంలో కాని, ఉన్న బంధువులెవరూ ఆమెను పోషించలేని పరిస్థితిలో నూ పోషణ బాధ్యత రాష్ట్ర వక్ఫ్‌బోర్డుకు ఒప్పగించుటకుకూడా మేజిస్ట్రేటుకు అధికారం కల్పించారు.

ఈ బిల్లు విచిత్రంగావుంది. ఇతర ఏ ముస్లిం దేశంలోనూ ఇటువంటి శాసనం లేదని భావించవచ్చు. పేరు: "విడాకులైన ముస్లిం స్త్రీల హక్కుల రక్షణ బిల్లు". కాని ఈ బిల్లుద్వారా వారి హక్కులు రక్షించబడే దానికి బదులు ఉన్న హక్కులు పోవడం జరుగుతున్నది. మహమ్మదీయ న్యాయశాస్త్రం ప్రకారం తనకు ఇష్టం వచ్చినపుడు భార్యకు విడాకులిచ్చే హక్కు, భర్తకు వుంది. దానికి ఎటువంటి కారణం ఉండనవసరం లేదు మూడు సార్లు 'తలాక్' అనే పదాన్ని పలుకగానే వివాహం రద్దవుతుంది. ఆ విధానంలో విడాకులివ్వబడిన భార్యను పోషించవలసినబాధ్యత భర్తపై పెట్టడం ధర్మ సమ్మతం. ఆ బాధ్యతను ఆమె ఇతరబంధువులపై ఉంచడం సబబు కాదు. వక్ఫ్‌బోర్డుకు ఆ బాధ్యతను అప్పగించడం అసలే సరికాదు. చాలా రాష్ట్రాలలో వక్ఫ్‌బోర్డులు తమ్ముతాము పోషించుకోలేని పరిస్థితులలో ఉన్నాయి. ఈ పరిస్థితులలో విడాకులైన స్త్రీల పోషణ బాధ్యత వాటికి కల్పించడమంటే అనేకమైన సమస్యలను కొనితెచ్చుకోవడమే!

ఈ బిల్లు రాజ్యాంగపు విలువలకు మానవ హక్కులకు భిన్నంగా వుంది! రాజ్యాంగపు 14 వ నిబంధన ప్రకారం దేశ ప్రజలందరికీ న్యాయశాస్త్రం దృష్టిలో సమానత, సమానమైన రక్షణ వున్నాయి. 15 వ నిబంధన ప్రకారం పౌరులెవరూ మతం కారణంగా ప్రత్యేకించబడరాదు. 1948 వ సంవత్సరంలో ఐక్యరాజ్య సమితి ప్రకటించిన మానవ హక్కులు సైతం న్యాయశాస్త్రపు దృష్టిలో పౌరులందరికి సమానత, సమానమైన రక్షణ వుండాలని నిర్దేశిస్తున్నాయి. విడాకులిచ్చిన భర్తచే పోషించబడే విషయంలో ముస్లిం స్త్రీలను ప్రత్యేకించడం- ఆ హక్కును వారికి లేకుండా చేయడం, పై సిద్ధాంతాలకు విరుద్ధంగా వుంది.

ఈ విషయమై మహమ్మదీయులలోనే ఏకాభిప్రాయంలేదు. వారిలో అభ్యుదయ వాదులంతా ఈ బిల్లును వ్యతిరేకిస్తున్నారు. ముస్లిం స్త్రీల సమాఖ్యలుకూడా బిల్లును వ్యతిరేకిస్తున్నాయి. పూర్వాచార పరాయణులు మాత్రమే దీనిని సమర్థిస్తున్నారు. మహమ్మదీయులలో దీనిపై ఏకాభిప్రాయం లేదనడానికి కేంద్ర ప్రభుత్వంలోని ఇద్దరు ముస్లిం మంత్రుల వైఖరికన్నా వేరే నిదర్శనం అవసరం లేదు. శ్రీ జెడ్. ఆర్. అన్సారి బిల్లుకు పూర్తి మద్దతు ఇస్తుండగా, ఈ బిల్లు కారణంగా శ్రీ ఆరిఫ్ మహమ్మద్‌ఖాన్ తన మంత్రి పదవికి రాజీనామా ఇచ్చారు. బిల్లును సమర్థించేవారి వాదన ప్రకారం వివాహం, విడాకులు, భరణపు హక్కు మతానికి సంబంధించినవి. మహమ్మదీయ న్యాయశాస్త్రంలో విడాకులైన భార్యను, 'ఇద్దత్' కాలం తర్వాత పోషించవలసిన బాధ్యత భర్తకు లేదు. అందువల్ల క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 125 వ సెక్షన్ తమకు వర్తించకూడదు. ఈ వాదన నిరాధారమైనదని షాబానో కేసులో సుప్రీంకోర్టు విపులీకరించింది!

దైవమంటే ఏమిటి? దైవానికి మానవునికి వున్న సంబంధమేమిటి? మానవుడు ఏ విధంగా ముక్తి పొందగలడు? ఇటువంటి విషయాలు మాత్రమే మతానికి సంబంధించినవి. మతం పరానికి సంబంధించినది. అది అలౌకికం. వివాహాది విషయాలు లౌకికమైనవి. మనది మతాతీత రాజ్యం. మతం విషయంలోమాత్రం ప్రభుత్వం జోక్యం చేసుకోకూడదు. పౌరులందరూ మత స్వాతంత్ర్యం కలిగి ఉండాలి. మతంపేరుతో లౌకిక విషయాలలోకూడా మార్పులు రాకూడదన్న వాదన సమర్థనీయంకాదు.

ఒకప్పుడు రాజ్యపాలన విషయంలో మతప్రమేయం వుంటూవచ్చింది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయాలలో మతం జోక్యంచేసుకొనేది. ఆకాలంలో న్యాయశాస్త్రాలు మతాల ఆధారంగా రూపొందాయి. మహమ్మదీయ న్యాయశాస్త్రమేకాక, హిందూ న్యాయశాస్త్ర విషయంకూడా అంతే. క్రమేణా లౌకిక విషయాలపై మతానికున్న పట్టు సడలుతూ వచ్చింది. న్యాయవ్యవస్థలలో అనేక మార్పులు చేయడం జరిగింది. సంఘం మారినకొద్దీ అమార్పుకు అనుగుణంగా న్యాయశాస్త్రాలుకూడామారుతూవచ్చాయి. హిందూ న్యాయశాస్త్రంలో వారసత్వం, వివాహం, దత్తత, భరణపు హక్కు మొదలైన ఎన్నో విషయాలు క్రోడీకరింపబడ్డాయి. ప్రపంచంలోని అనేక ముస్లిం

బిల్లుకు నిరసనగా కేంద్ర మంత్రిత్వాన్నే త్యజించిన ఆరీఫ్ మహమ్మద్‌ఖాన్

దేశాల న్యాయవ్యవస్థలలో గణనీయమైన మార్పులు జరిగాయి. పాకిస్తాన్, టర్కీ, ఈజిప్ట్, ఇండోనేషియా, అల్జీరియా, ట్యునీషియా, మొరాకో, సిరియా, సూడాన్

—కొరవ 12వ పేజీలో

## పినాకిని తీరం

ఏ. ఆర్. కాలేజి

### చేతులు మార్పు!

రోలుపోయినా లిద్దెలిగిసిందన్నట్లు, వి. ఆర్. కాలేజి కమిటీ ఫలితాలు ఏ ఏట్లో అయినా పోనీండికాని, ప్రస్తుత కరస్పాండెంటు శ్రీ మేనకూరు ఆదిశేషారెడ్డి ఎన్నికలనుమాత్రం బహుపద్ధతిగ, అనుభవజ్ఞులైన అడ్వొకేటు కాబట్టి నిబంధనావళి తుచ తప్పకుండా అనుసరిస్తూ నిర్వహిస్తున్నారు. నిబంధనావళి గుట్టు చప్పుడుకాకుండా వారు సవరించుకున్నదే గదా అంటారా? కావచ్చు: సవరించిన దాన్ని అమలు జరపడమైనా గొప్పేగదా! అందుకే ఆదిశేషారెడ్డిగారికి నేను జేజేలు చెప్తున్నాను.

27 తేది బ్యాలెట్ పేపర్లు పంపడం ప్రారంభమవుతుందట; ఆ తతంగం ఏప్రిల్ 19 తేది పగలు 11 30 వరకు కొనసాగుతుంది. తదనంతర కార్యక్రమం ఏమిటో నాతోటి మీరూ పత్రికా ప్రకటన చదివినతర్వాత తెలిసికోవచ్చు!

ఇంతకూ ఎన్నిక జరుగుతుందేది పాతవిద్యార్థులు ఎన్నుకోవలసిన రెండు స్థానాలకుమాత్రమే. తక్కినవన్నీ దొడ్డిదారిన భర్తీచేసుకోబడేవే! ఎన్నికజరిగే రెండుస్థానాలకు ఆనం వర్గంగా ఇద్దరు, వ్యతిరేకపక్షంగా ఇద్దరు పోటీలో మిగిలి వున్నారు. ఆ ఇద్దరిని ఆనంవర్గం అనవచ్చునా? ఖచ్చితంగా అయితే రెండో లేక మూడోతరం ఆనంవర్గం అనాలి. అదికూడా కరెక్టుకాదేమో? ఎందువల్లనంటే ఇప్పుడు పోటీచేస్తున్న ఇద్దరిలో ఒకరైన శ్రీ తూపిలి సుందరరామరెడ్డి నేరుగా ఆనం వెంకటరెడ్డి అల్లుడు. వెంకటరెడ్డిగారు ఆవర్గంలో మొదటితరం వారే అవుతారు; అందువల్ల సుందరరామరెడ్డిని రెండవతరంలో చేర్చలేము. కాబట్టి ఆనంవర్గంలోని రెండవశ్రేణి లేక మూడవశ్రేణి నాయకత్వమనో, ఆధిపత్యమనో అనుకుంటే ఇటు వివేకానందరెడ్డికి, అటు సుందరరామరెడ్డికి కలిపి సరిపోతుంది!

బి. జె. పి. వాళ్ళు పోటీ చేస్తున్నారనుకోండి; గెలవడానికికాదు. బహుశా నిష్పోటీగా వదలగూడదనే వుద్దేశ్యంతో పోటీ చేస్తుండవచ్చు. ఓటర్ల రహస్యం వివేకానందస్వామికి తప్ప తక్కినవారికి దుర్భేద్యం! కష్టపడి కూర్చొని జ్ఞాపకానికి తెచ్చుకొని కేహెప్ అడ్రసుతో ఓటర్లను చేస్తున్నాడు. నల్భైరెండువేల రూపాయలు హార్డ్ క్యాష్‌గా ఎవరిదైనా కాసివ్వండి. జేబినుండి చెల్లించింది వివేకానందుడే అయినపుడు వాటిమీద హక్కు అనుభవాలు అతనికే సంక్రమిస్తాయిగాని, వాటికోసం ఇతరులు ఆశపడడం ఏమి న్యాయం?

ప్రస్తుత అధ్యక్ష కార్యదర్శులైన భక్తవత్సలురెడ్డి, ఆదిశేషారెడ్డిగార్ల పేర్లు పోటీ జాబితాలో కనపడడంలేదు. వారసులు విరమించుకున్నారా లేక వేరే మార్గాన ప్రత్యక్షమవుతారా? తెలియదు. కాని

—కొరవ 12 వ పేజీలో

## జనవాణి

# పంజాబును కాపాడాలి!

పంజాబ్ పరిస్థితి మళ్లీ మొదటికివచ్చింది. 'ఆపరేషన్ బ్లూ స్టార్'గా పేరుగన్న సైనికచర్యకుముందు ఎటువంటి అరాజక పరిస్థితులు నెలకొనివుండినవో, ఈనాడు పరిస్థితి అంతకంటే అధ్వాన్నమా అనిపిస్తున్నది.

నిత్యం ఆరాష్ట్రంలో ఎక్కడో ఒకచోట అమాయకులను హత మార్చడం జరుగుతూనేవుంది; బ్యాంకులు దోపిడి చేయబడుతూనే వున్నాయి; తమ విరోధులనుకున్నవారి ఇళ్లు, అంగళ్ళు అగ్నికి ఆహుతి గావించబడుతూనే వున్నాయి: ఒక్కమాటలో చెప్పాలంటే పంజాబులో శిక్కు వుగ్రవాదేతరుడు ఇంటినుండి కాలు బయటపెట్టడానికి వీలులేని భయంకర పరిస్థితులు అలముకొని వున్నాయి.

అమృతసర్‌లోని స్వర్ణదేవాలయాన్ని ఉగ్రవాదులు తిరుగా తమ హస్తగతం చేసుకున్నారు; నేడు మరలా అది ఒక సైనికశిబిరంగా మార్చుబడింది. ఆనంద్‌సాహెబ్ వంటి గురుద్వారాలు ఇంకా వారి అధీనం కాకపోయినా అవి కబళింపబడడానికి ఇంకెంతోకాలం పట్టకపోవచ్చు. గత శుక్రవారంనాడు వుగ్రవాదులు అన్నిదారులు మూసివేయబడిన చండీఘర్‌లో ప్రవేశించి, ప్రకటించిన విధంగా శాసనసభ ప్రాంగణంలో జొరబడి ఘెరావ్ చేయగలిగారు. ఆనాడు వుగ్రవాదులు పోలిస్ భద్రతాదళాలమీద కత్తులుదూస్తూ, ముందుకు రకడాన్ని చూచినపుడు, అనాటి బింద్రన్‌వాలె అరెస్టునాటి దృశ్యం స్మృతిపథంలో మెదలింది. అంతేకాదు, 25 తేది ఆనంద్‌సాహెబ్‌లో ముఖ్యమంత్రి బర్నాలాను, ఆయన మంత్రివర్గ సహచరులను తుద ముట్టించడానికి పథకంప్రకారం ప్రయత్నం జరిగింది; కాల్పులలో పన్నెండుమంది ప్రాణాలు పోయినా, పోలిస్ పరిస్థితి అదుపుతప్పకుండా చూడగలిగిందికాని, లేకుంటే ఈపాటికి బర్నాలాకూడా ఒక మృతవీరుడై పోయివుండేవాడు!

ఈవిధంగా పంజాబ్ తగలబడిపోతున్నది. ప్రజలెన్నుకున్న బర్నాలా అకాలీదళ్ ప్రభుత్వం పంజాబులో శాంతి సామరస్యాలను నెలకొల్పగలదని, వుగ్రవాదులనుండి పంజాబును రక్షించగలదని ఆశించాంకాని; ప్రజలిచ్చిన బలాన్ని బర్నాలా వుపయోగించుకోలేకపోయాడు; పంజాబ్ ప్రజలకు రక్షణ కల్పించలేక పోతున్నాడు. పాముకు పాలుపోసినట్లు; బర్నాలా వుగ్రవాదులను తన ఔదార్యంతో దారికి తేవాలని మెత్తగా వ్యవహరించాడు; వారు ఇది బర్నాలా ప్రభుత్వపు చేతగానితనంగా, బలహీనతగా భావించి ఆయన్నే కాటేయడానికే పూనుకున్నారు; పంజాబులో మరొకమారు సంక్షోభాన్ని సృష్టించ సమకట్టారు.

పంజాబ్ చేయిదాటిపోతున్నది. బర్నాలా ప్రభుత్వం వుగ్రవాదులను, వారి హింసాకృత్యాలను అదుపులోపెట్టగలదనే విశ్వాసం సడలిపోయింది. ఇక రోజురోజుకు పరిస్థితులు క్షీణించి పంజాబ్ దేశ సమైక్యతకు, భద్రతకు పెద్దసవాల్‌గా పరిణమించగలదనడంలో ఎటువంటి సందేహంలేదు. కేంద్రం బర్నాలా ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నమాట నిజమే: కాని ఒక్కో హెచ్చరికతర్వాత బర్నాలా ప్రభుత్వం మరీమరీ విఫలమవుతున్నది, అందువల్ల పంజాబువుగ్రవాదాన్ని అదుపులో పెట్టేబాధ్యతను కేవలం బర్నాలా ప్రభుత్వానికే వదలిపెట్టడం కాకుండా, రాష్ట్రప్రభుత్వ సహకారంతో కేంద్రమూ తాను చేయగలిగింది చేయాలి; పంజాబును నరహంతకులనుండి, విచ్ఛిన్నకారులనుండి, దేశద్రోహులనుండి కాపాడాలి! రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు కలిసి ధన మాన ప్రాణరక్షణకు, ప్రశాంత జీవనానికి పంజాబ్ ప్రజలకు పూచీ ఇవ్వాలి !!



## జమీన్ రైతు

27-3-1936

### సుదర్శనమ్మగారి నిర్యాణము

నెల్లూరు రెడ్డి ప్రముఖులును, కాంగ్రెసువాదులునగు తిక్కవరపు రామిరెడ్డిగారి ధర్మపత్నియు, బెజవాడ చంద్రశేఖరరెడ్డి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి గోపాలరెడ్డి, రామిరెడ్డిగార్ల సోదరియును, వదాన్యశేఖరుడు స్వర్గీయ బెజవాడ పట్టాభిరామిరెడ్డిగారి పుత్రికయునగు సుదర్శనమ్మగారు గత నాలుగు మాసములుగా తీరని హృదయ రుగ్మతచే బాధపడుచు, 24 తేది ఉదయం 7-25 గంటలకు తనువు చాలించిరి. సోదరులు, ఆప్త బంధువర్గము మ్రోల మద్రాసులో అసువుల బాసినదని తెలుప చింతిస్తున్నాము.

ఆయమ ప్రహసోదారాల హృదయ, సౌజన్యశీల, పితృభక్తి, పతివ్రత, పరోపకారపారీణ; ఈయమ 1920 సం॥ మొదలు కాంగ్రెసోద్యమమునందు అత్యంత భక్తిశ్రద్ధలుకలిగి, ప్రతివిషయములోను యథాశక్తి ధన సహాయము చేయించు ప్రత్యక్ష పరోక్షముల కాంగ్రెసును సేవించుచున్న నారీమణి. ఈయమ మరణించునప్పటికి వయసు 39 సం॥ మాత్రమే.

### ఉగాది కానుక

మామిడిచూలు మోయ, నవమల్లిక

పుష్పిణిగా, లయోధర

శ్యామలగాంగ ధాత్రి, లలితార్పనలన్

నవరాత్రులొప్ప, ము

క్తి మహిరావళిన్ సరసితాల్పు జరొప్పు

దవ్వల్ త్యజింప నా

రామ వనస్పతుల్ శుభపరంపరలన్

అనుముల్లుదు వత్సర

స్వాగతి, ధాతవి శరణాగతన్,

మ్రొక్కు రుగాది ప్రార్థులన్

-రాయప్రోలు.

### వోటర్లకు హెచ్చరిక

నెల్లూరు జిల్లాబోర్డు ఎన్నికలును, శాసనసభల ఎన్నికలును ముందు జరుగనున్నవి. మార్చి ఆఖరులో సంవత్సరాంతమగు మునిసిపాలిటి ఇంటిపన్నులు వగైరాలు మార్చి 31 తేది లోపలను, ల్యాండు రెవిన్యూ వగైరాపన్నులు జూన్ 30 తేది లోపలను పూర్తిగా చెల్లించిన వారినే ఓటర్లలిస్టులందు చేర్చెదరు, లేనివారిని చేర్చరు.

### నెలూరు ముచ్చట్లు

ఎలక్ట్రిక్ కంపెని మేనేజరు రంగస్వామిరెడ్డిగారింట లైట్లు ఉదయం 8 గంటల దాకా చల్లారవటనే, పగలు ధీటితో పాలించిన రెడ్డి వంశీయులు కావటం మూలాన్నా? లేక మీటరు లేనందున్నా?

# రైతుల కందని సబ్సిడీ ఎరువులు!

బుచ్చిరెడ్డిపాళెం సమితిలో 50 శాతం సబ్సిడీ పథకంక్రింద ఎరువుల పంపిణీ కార్యక్రమంలో రైతులకు చాలా అన్యాయంజరిగింది. సమితి అధ్యక్షుడికి తెలియకుండా, సంబంధిత అధికార్లు ఎరువులను పెద్దఎత్తున దుర్వినియోగం చేసినట్లు కన్పిస్తుంది.

ఈ పంపకానికి ఒక్కోరోజు ఒక్కో గ్రామానికి కాకుండా, అందర్నీ అన్ని రోజులూ పిల్చారు. సమితి ఆఫీసులో త్రొక్కిసలాట కల్పించారు. నాలుగైదు రోజుల తర్వాత, ఒక సాయంత్రం గ్రామాల వారీగా కోటా ఏర్పాటుచేసి, విడిఓ దగ్గర ఫారాలుతీసుకొని సిఫార్సుచేయించుకుని రమ్మన్నారు.

కష్టపడి విడిఓ సంతకం తీసుకుని అక్కడికిపోయినతర్వాత, మీ గ్రామం కోటా అయిపోయింది, వెనక్కుపోండి, అని తరిమేశారు.

గ్రామానికి ఎంతకోటా ఇచ్చింది వి.డి.ఓ. కు చెప్పి, ఆయన సిఫార్సు కావాలని నిర్దేశించినప్పుడు-అదేఫారాలు తీసుకునివెళ్ళిన రైతులకు ఎరువులేకుండా ఎందుకు ఖాళీ అయినాయి? నిజంగా అయిపోయాయా, లేక అట్లా చెప్పి పంపారా? సమితి అధ్యక్షుడు, వున్నతాధికారులు ఈ విషయమై దర్యాప్తుచేయించి రైతులకు న్యాయంచేయాలని మనవి.

-ఒకరైతు.

## మునిసిపల్ పన్నులు-మర్యాద పాటించండి!

నెల్లూరు టౌన్‌లో మునిసిపాలిటి పన్నులవసూలు ప్రారంభించింది. పన్నులు కట్టడం ప్రతిపౌరుడి కర్తవ్యం. అయితే ఈ వసూలు పనిలో పౌరులపట్ల మర్యాదగా ప్రవర్తించడం మునిసిపాలిటీ బాధ్యత. బిల్లుకలెక్టర్లు, పౌరులప్రశ్నలకు మర్యాదగా సమాధానాలుచెప్పి, సందేహాలు నివృత్తిచేసి పన్నులు దండితే బాగుంటుంది. వారు దురుసుతనంగా, దౌర్జన్యపూరితంగా వ్యవహరిస్తే మాపోటి వారికి మనసుకష్టం కలగడమేకాదు-పన్నుకట్టాలన్న కోరికకూడా నశిస్తుంది.



గతంలో కొందరు బిల్‌కలెక్టర్లు పన్ను కట్టించుకొని, రశీదులు ఇవ్వక, మళ్ళీ

-కొరవ 14 వ పేజీలో

## మేము-మీరు

### తిప్పు ఎస్ ఐ పై అసత్య ప్రచారం

కరపత్రాలు పంచడంకూడా నేరమా (మార్చి. 14) అని కప్పరాళ్ళ తిప్ప సబిన్‌స్పెక్టర్‌పై ఒక పాఠకుడు చేసిన ఆరోపణలు సత్యదూరాలు. విద్యార్థులకు అదాయం సర్టిఫికేట్ ఇవ్వకుండా ఎం ఆర్ ఓ ఇబ్బంది పెట్టాడనడంకూడా అసత్యమే!

కావలికి చెందిన ఒక రాజకీయ నాయకుడు అధికారులపై వ్యక్తిగత కక్షతో కరపత్రాలు ప్రచురించి, విద్యార్థులచేత పంపకం చేయించాడు. తర్వాత ఆ విద్యార్థులే- అదాయం సర్టిఫికేట్‌కు తమకు సంబంధంలేదని చెప్పడం జరిగింది. ఇందులో ఎస్. ఐ. చేసిన తప్పు కూడా ఏమీలేదు.

విశ్వనాథరావుపేట -ఎం. డి. అబ్దుల్లా

# పెసరను లద్దెపురుగు పూజ్యం చేసేస్తూంది!

పెసర, మినుమువంటి కాయధాన్యాలు పండించమని ఆకాశవాణిలో వ్యవసాయ శాఖవారు నిత్యం ప్రచారం చేస్తుంటారు. దానివల్ల దేశానికి మేలు అని, రైతుకు ఆదాయమని ప్రబోధిస్తుంటారు. పైగా మన దేశంలో పప్పుధాన్యాల కొరత ఎక్కువగా వుంది.

వ్యవసాయశాఖ వారు చెప్పే ప్రతిమాటలో నిజముంది. రైతుల అనుభవం కూడా అదే: మెట్టపొలాలకు అనుగుణంగా పెసర, పిల్లిపెసర, మినుము చల్లుకుంటే తమకు, తమ పొలానికి మేలేనని వారికి తెలుసు, కాని ఏ పైరు పెట్టుకున్నా ప్రకృతి ప్రకారంలో విపరీతమైన నష్టానికి గురైతే, రైతు ఏమిచేయగలడు? పైరు పెట్టండి. ఈ పైరు పెట్టండి అని చెప్పి వ్యవసాయశాఖ అంతటితో తన బాధ్యత తీరిపోయినట్లు భావిస్తుంది: వాళ్ళ సలహా విని పైరు పెట్టి రైతు చావు రైతుదే!

గత సంవత్సరం పెసర మినుము బాగా పండాయి; మంచిధర కూడా వుండింది. వాటివల్ల రైతులు నాలుగు రూపాయలు కళ్లజూడగలిగారు. ఆ అనుభవంతో ఈ సంవత్సరం ఎక్కువగా చల్లారు: పైరు కన్నులపండుగగా ఏపుగా



వుండింది; దాన్ని కాపాడుకోడానికి తమంతట తాముగా సస్యరక్షణ చర్యలుకూడా తీసుకున్నారు. కాని ఏం ప్రయోజనం? పాగాకు లద్దెపురుగు. క్షణాల్లో పైరును పొట్టన పెట్టుకుంది. అది ఎంతవేగంగా వ్యాపించి పైరును తుడిచిపెట్టేసిందంటే బ్లడ్ కాన్సర్‌కుకూడా అంత స్పీడు వుండదనుకోండి!

ఇతరచోట్లకూడా వ్యాపించిందో లేదో, వ్యాపించివుంటే నష్టం ఏమిటో తెలియదుకాని: నెల్లూరు తాలూకాలోని పెనుబర్తి, కలివెలపాళెం వగైరా మూడు నాలుగు గ్రామాలలో మోకాలెత్తు పైరు మూడునాలుగు రోజుల వ్యవధిలో ఎల్లిపోయిందని చెప్తున్నారు. చెట్టునిండా పురుగులే: ఆకు నేలరాలు. కాయల్ని కూడా కొట్టివేశాయి. రెండుసార్లు మందుకొట్టినా కంట్రోల్ కాలేదని, కంటినీళ్ళు కడుపుకు దించుకొని పైరులో పశువులు తోలేశారని తెలుస్తున్నది. ఒకరైతు పెసర ముప్పయి ఎకరాలు చల్లారు; యాభైవేలయినా మిగులుతుందని ప్రవ్వర్లూడుతుండినారు. సమూలంగా పైరు నాశనమైపోతె దుర్బలులైతే అటువంటి రైతుకు గుండె ఆగిపోక ఏమవుతుంది?

పెసర పైరును నాశనం చేస్తున్న పాగాకు లద్దెపురుగును నివారణ: (1) ప్రారంభదశలో అయితే కోరబాన లేక బాక్సిబాన లేక డర్స్‌బాన 1 లీటరు నీటిలో 3 మి. లీ. మందు (2) ముదిరిపోయిన దశలో- సెల్‌వాల్ 1 లీటరు నీటిలో 1/2 మి. లీ. మందు - కలిపి ఎకరాకు పది టాంకులకు తక్కువ లేకుండా కొట్టాలని శాస్త్రజ్ఞులుచెప్తున్నారు.

వ్యవసాయశాఖకు ఈ పురుగులు, తెగుళ్ళు నష్టంసంగతి తెలుసా? నష్టపోయిన రైతువచ్చి భోరున ఏడ్చివుంటే తెలియపలసిందే! ఏపైరుపెట్టినా రైతు గతి ఈవిధంగానేవుంది! ★



## ★ ★ నామాట ★ ★

★ అర్చన 'అబ్బా' అనిపించింది!

★ ఆత్మకూరు బస్టాండు ట్రాఫిక్-ఎందుకీ పాట్లు?

★ ఈ నాయకులేరీ? ఎటుపోయిరి?

కథల ప్రపంచంనుంచి అల్లావుద్దీను లాక్కొచ్చి, 'అర్చన' ఎదుట నిలబెడితే ఏమంటాడో చూడాలని నాకు మహా తహతహగావుంది. అద్భుతదీపం నిమిరి రాత్రికి రాత్రికి దేవేంద్ర భవనాలుకట్టగల సామర్థ తనకొక్కడికే వుందని వందేళ్ళనుంచి కథల్లో గొప్పలుపోయాడు అల్లాఉద్దీన్! ఏ "రాక్షస మహిమల" తోడ లేకుండానే, కన్ను మూసితెరిచేలోగా అకాశసౌధమంతటి సినిమాహాలుకట్టి, అల్లాఉద్దీను మరపించారు మాగుంట సోదరులు.

'అర్చన'లో ప్రత్యేకతలంతా, అది నిర్మితమైన వేగమే. పాతుబడి, శిధిల రాజప్రాసాదంవలె వుండిన రంగమహల్‌కు, ఊపిరి తిప్పుకునే వ్యవధిలోగా రాజకళ తేవడమంటే మాటలా?

మాగుంటసోదర త్రయం మనసు మంచిది; అందువల్లే వారేపని తలపెట్టినా నిర్విఘ్నంగాజరిగిపోతూంది. పైకిచెప్పుకపోయినా పంతాలు పట్టింపులతో కట్టిన థియేటర్ 'అర్చన': కాని, 21 తేది ప్రారంభోత్సవ సమయంలో వచ్చిన 'ఆహూతులు', వారితో సోదరత్రయం అరమరికలు లేకుండా మెలిగినతీరు- సంపన్నుల "సహృదయత"కు మానాగా కన్పించింది.

ఈ థియేటర్ జనంలో సృష్టించిన క్రేజ్ మాత్రం అంతింతకాదు, హాలు తలుపులు తెరవడానికి వారం ముందునుంచే, సర్కస్ డేరానందుల్లో తొంగిచూచే చిన్నపిల్లలమాదిరి, నిక్కినిక్కి చూస్తూ రోడ్లో నిలబడ్డారు జనం. కట్టడం స్పీడు. ఖరీదులను కథలు కథలుగా చెప్పుకున్నారు. జనం చెప్పడమేకాదు- హాలులో ప్రత్యంగుళం కళ్ళు చెదర గొట్టేంత 'ఖరీదు'గానేవుంది.

అర్చన అందచందాల వర్ణన అంటారా-నేను చెప్పను. మీ రే పోయి చూడండి!

• • •

ఆత్మకూరు బస్టాండుదగ్గర ట్రాఫిక్

డోలేంద్ర

అదుపుకోసం పోలీసులు పడ్తున్నపాట్లు, చేస్తున్న సర్కస్‌ఫీట్లు చూస్తుంటే అపుకోలేని నవ్వొస్తూంది: అయ్యో పాపం అన్పిస్తూంది.

ఒకరికిద్దరు సబిన్స్‌పెక్టర్లు లాఠీలు ఝళిపిస్తూ హుంకరింపులు: చేతులూపుతూ కానిస్టేబిళ్ళుచేసే కథాకళి నృత్యం; మధ్యమధ్యలో పికిలీల పీ.... పీ....లు; ఇంకొకప్రక్కనుంచి లేడి హోంగార్డు మైకులో సృష్టించే మాటల రొద. వీరందరిలో ఎవరుచెప్పినట్లు నడవాలో మనకైతే అర్థంకాదు, ఉన్నట్టుండి నాలుగుప్రక్కలనుంచి ఒకేసారి ట్రాఫికంతా కదులుతుంది; లేకుంటే నాలుగు ప్రక్కలా ఒకేసారి నిల్చిపోతూంది, ఇట్లా ఎందుకు జరుగుతుందో తెలుసుకోలేక,

—కొరవ 14వ పేజీలో

అందానికే అందం తెచ్చి
ఆనందమకరందం
ప్రేక్షకులకు అందించి...

వాస్తుశిల్పానికే వన్నె తెచ్చి
సినీ కళామతల్లికి
కుసుమాంజలి ఘటించి...

విశ్వకర్మను తలపింపజేసే
వింతైన సౌకర్యాలు చేర్చి
చిత్ర, విచిత్ర సొగసులు కూర్చి...

చిత్రమందిరమంటే
ఇదిగో..ఇట్లావుండాలన్నంత
నేర్పుగా, పొందికగా కట్టిన

# అర్చన 70 ఎం ఎం ఏ.సి.

తెలుగు చలనచిత్ర లోకంలో మకుటాయమానం కావాలని..
తెలుగులో వచ్చే, ప్రతి మంచి చిత్రానికి నిలయం కావాలని..
ఆశిస్తున్నాము... ఆకాంక్షిస్తున్నాము.. ఆనందపడుతున్నాము.

★

మా ద్వారా విడుదలైన సంచలనాత్మక చిత్రం "సింహాసనం" కోసం శర వేగంతో "అర్చన" నిర్మాణం పూర్తి చేసిన మాగుంట సోదరత్రయం-సుబ్బరామరెడ్డి, శ్రీనివాసులురెడ్డి, సుధాకర రెడ్డి గార్లకు, అనుకున్న తేదికి నిర్మాణం పూర్తి చేయడానికి అహరహం శ్రమించిన సాంకేతిక నిపుణులు, సిబ్బందికి మా ధన్యవాదాలర్పిస్తున్నాము.

# శాంతి పిక్చర్స్

బృందావనం-నెల్లూరు టెలిఫోన్ : 5714

అర్చన ఏ.సి.లో మా ద్వారా విడుదలైన "సింహాసనం" నెల్లూరు పట్టణ చలనచిత్ర చరిత్రలో మొదటివారం కలక్షన్లలో రికార్డు సృష్టించి 41 షోలకు రూ. 1,72,241 లు వసూలు చేసి అఖండ విజయం సాధించిన శుభసందర్భంలో ఎల్లరకూ మా హృదయపూర్వక అభినందనలు.

## శ్రీ శివకామేశ్వరి మహాయజ్ఞము

7-4-86 నుండి రేగుంటపాడులో

భగవాన్ శ్రీ రమణమహర్షులవారి

36 వ ఆరాధన సందర్భంగాలో

7-4-86 నుండి 16-4-86 వరకు

అఖండానందాశ్రమంలో

శ్రీ శివకామేశ్వరి మహాయజ్ఞము జరుగును.

భక్తులెల్లరు సహకరించవలెనని, యజ్ఞానికి విచ్చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

—భక్తబృందము.





నెల్లూరు డి॥ ము॥ కోర్టులో

E. P. No. 54/85

O. S. No. 345/81

పొన్నెబోయిన జయరామయ్య —వాది

ముంగర చిన్నమస్తానయ్య —ప్రతివాది

ముంగర చినమస్తానయ్యగారికి—

S/o. కోటయ్య పున్నూరు మజరా పాటిమిట్ట, నెల్లూరు తాలూకా

సదరు నంబరులో మీ తాలూకు స్థిరాస్తిని ఏలం కోరి వారి మోషన్ దాఖలు చేసుకున్నందుకు మీకు సేలు నోటీసు నిమిత్తం తేది 2-4-86కి వాయిదా వేయబడి వున్నది. సదరు విషయమై మీకు గల ఆక్షేపణలు వాయిదా రోజున పగలు 10½ గంటలకు కోర్టుకు హాజరై తెలుపుకునేది. లేనియెడల మీ పరోక్షమునందు తీర్మానింపబడునని తెల్పడమయినది.

—కె. శంకరం వాది తరపున అడ్వొకేటు





## HORSLEY HILLS SCHOOL

HORSLEY HILLS POST

**Via Madanapalle** (A.P.)

Pin : 517 327

## ADMISSION NOTICE

An English Medium Residential Public School preparing Boys & Girls for ICSE Examination conducted by the Council for Indian School Certificate Examination-New Delhi.

Salunrious climate (4200 feet above sea level) with decent amenties. Qualified and devoted teachers. Surroundings ideal for healthy Physical and Intellectual growth of young children.

The School aims at teaching self reliance, integrity of character and all round development of personality and high academic excellance.

For enquiries/prospectus write to Principal.

## • ఉత్తరక్రియలు •



మా తండ్రి

కలికి రమణారెడ్డిగారు

నెల్లూరు.

**20-3-86** తేది గురువారం స్వర్గస్తులైనారు.

వారి ఉత్తరక్రియలు

**3-4-86** తేది గురువారం

నెల్లూరు ఆర్.టి.సి. బస్ స్టేషన్ వెనుకవైపు శోధన్ నగర్‌లోని మా స్వగృహమున జరుగును. మా బంధుమిత్రులు తెలియగోరుతాము.

కలికి రామ్మోహన్‌రెడ్డి - హైమావతి

రాఘవరెడ్డి

నందకుమార్ రెడ్డి

కుమార్తె - అల్లుడు : అనుమాల నిర్మల - దయాకరరెడ్డి.

# ప్రత్యక్ష చర్యకు దిగితేకాని బస్ సౌకర్యం కల్గించరా?

## జిల్లావార్తలు

కోవూరుతాలూకా అల్లూరు మండలం అనాజ్ఞేమో - పురిణికి పెద్దపుర్యెళ్ళ నుండి ఒకే ఒక బస్సు; ప్రయాణీకులు అసంఖ్యాకంగా పెరిగిపోతున్నా బస్సు మాత్రం ఒక్కటే. అదివస్తే ఎక్కాలి; లేకుంటే కాలికి బుద్ధిచెప్పాలి! అది వారాలపర్యంతం రానిరోజులున్నాయి; చెడిపోయిందనో, బ్రేకులు పోయిందనో, వాననో, రోడ్డు బాగాలేదనో.... ఏదోఒక సాకుతో రోజులపర్యంతం వచ్చేదికాదు. అది రానప్పుడు ఈ బస్సుమీద ఆధార పడిన పురిణి, ఇందుపూరు వగైరా గ్రామాల ప్రజలదురవస్థ చెప్పతరంకాదు. రెండో బస్సుకోసం ఆ గ్రామాలవారు ఎన్నిసార్లో ప్రయత్నంచేశారు. బస్సు పెద్దవారిదైనందువల్లనూ, రవాణాశాఖాధికార్లు బస్ యజమానుల పక్షపాతులై నందువల్లనూ తమ ప్రయత్నం ఫలించ లేదంటారు ఆ గ్రామాల ప్రజలు.

బస్సు యాజమాన్యం మారింది. రెండుమూడు వూళ్ళకే చాలక ఇబ్బంది పడుతుంటే ఆ బస్సును గోగులపల్లెకు పొడిగించారట. రెండోబస్సు వేయలేదు; వున్నబస్సు తమకే చాలదంటే మరో వూరికి పొడిగించారు. దీనితో టాప్‌మీద కూడా సందులేని దౌర్భాగ్యపరిస్థితి ఏర్పడింది. ప్రక్కనేవున్న బొమ్మ చూడండి-వారంరోజులక్రితం ఇందుపూరు గ్రామస్తులు తీసింది; బస్సు లోపలేకాక, పైనకూడా ప్రయాణీకులతో ఎట్లా కిటకిట మంటున్నదో: ఈ బస్సులో ప్రయాణించే దెట్లా? ప్రయాణించడం ప్రాణానికి ముప్పు తెచ్చుకోవడమేకాదా? అని ఆ గ్రామాల ప్రజలు అడుగుతున్నారు. అంతేకాదు; వారు ఈవిధంగాకూడా అంటున్నారు- "మా దురవస్థనుగూర్చి అధికార్లకు చెప్పుకొని చెప్పుకొని విసిగి వేసారిపోయాం. పిటిషన్లతో పనులు జర గవనే నిర్ణయానికివచ్చాం. ప్రత్యక్షచర్య తప్ప గత్యంతరంలేదు"- ఇవి వారి ముగింపు మాటలు.



పుష్పక విమానం కాదు-
పురిణి బస్సు!

ఇప్పుడు ఈ మాటలంటున్నది ఇందుపూరు, పురిణి గ్రామస్తులేకావచ్చు; తమ తమ బస్ సౌకర్యానికి సంబంధించి పెక్కు గ్రామాలవారు ఇటువంటి నిర్ణయానికే వస్తున్నారు. కొన్నిచోట్ల బస్సులను నిలేస్తున్నారు; తమ ఆగ్రహాన్ని ప్రదర్శిస్తున్నారు. ప్రజల అవస్థను అధికార్లు గమనించలేకపోతే, వారి కోర్కెలను నిర్లక్ష్యంచేస్తే ప్రతివూరూ ఒక ప్రత్యక్ష చర్యారంగమవుతుంది. పరిస్థితులను అంతవరకు తీసుకరావడం మంచిదికాదు. కలెక్టరుగారు జోక్యంకల్గించుకొని, పురిణి రూటుకు రెండుబస్సులను వెంటనే మంజూరు చేయించడమేకాకుండా, బస్ సౌకర్యంకోసం అలమటిస్తున్న ఇతర గ్రామాలవారి మొరనుకూడా ఆలకించి, బస్ సౌకర్యంకొరకు ప్రత్యక్షచర్యకు దిగవలసిన అవసరంలేకుండా చేయడం బావుంటుంది.

### యల్లాయపాళెం చెడుగుడు

యల్లాయపాళెం. ఫ్రెండ్స్ రిక్రియేషన్ క్లబ్ ఇటీవల చెడుగుడు పోటీలు నిర్వహించింది. లేగుంటపాడు, రాపూరు కాళయకాగొల్లు జట్లు బహుమతులు గెలిచాయి. రాపూరుజట్టుకు చెందిన ఎం. సత్యనారాయణ ఉత్తమ ఆటగాడుగా ప్రశంసలుపొందాడు. క్లబ్ అధ్యక్షుడు శ్రీ డి. మల్లారెడ్డి బహుమతులు పంచారు.

### వింజమూరు స్పెషల్ టీచర్లకు అన్యాయం

సమితి అధికార్ల నిర్లక్ష్యఫలితంగా, వింజమూరు సమితిలో పనిచేస్తున్న స్పెషల్ టీచర్లందరికీ ఉద్యోగాలు చేజారిపోయాయట. స్పెషల్ టీచర్లను రెగ్యులర్ చేయాలని ఆమధ్య ప్రభుత్వం తీసుకున్న ఉత్తర్వుప్రకారం. జిల్లాలోని అన్ని సమితులలోని స్పెషల్ టీచర్లకు శాశ్వత ఉద్యోగాలు లభించాయి. కాని విజంమూరు సమితివారికిమాత్రం రాలేదట.

కారణమేమిటని తర్వాత విచారిస్తే, వివరాలకోసం జిల్లాపరిషత్ అధికార్లు ఎన్నిసార్లు జాబులువ్రాసినా, రెండు టెలిగ్రాములు కొట్టినా విడిఓ పట్టించుకోలేదట. చూసి, చూసి విసుగెత్తి, గడువు మీరిపోతుందికాబట్టి వీరిని వదిలేసి, మిగతా సమితుల టీచర్లకు ఉద్యోగాలు యిచ్చేశారట, జి. ప. అధిపతులు.

సంత దారుణమైన నిర్లక్ష్యం ఇది? పట్టుమని పదిమందికూడా వుండని టీచర్ల పేర్లు, వివరాలుకూడా సేకరించి పంపలేనంతఅసమర్థంగా, మత్తులో,దీర్ఘనిద్రలో వుందా విజంమూరుసమితి? ఛీ....ఛీ!

### పురిణి కృష్ణ బర్త్‌డే

కోవూరు తాలూకా పురిణిలో సినీనటుడు కృష్ణ జన్మదినోత్సవం జూన్ 8 తేది వేడుకగా జరుగుతుందట; ఈ సందర్భంగాజరిగేరికార్డుడ్యాన్సు,సినిమాపాటల పోటీలలో పాల్గొనమని అభిమాన సంఘ

-కొరవ 10వ పేజీలో

## గొంతు అరువిచ్చే కళలో నేర్పరి దశరథరామరెడ్డి



సినిమా రంగంలో నెల్లూరీయుల పాత్ర, ప్రమేయం బహుముఖాలుగా విస్తరిస్తున్నాయి; పలుశాఖలకు పాకుతున్నాయి. నటులు, నిర్మాతలు, దర్శకులైతే మనకు నిత్యం కన్పిస్తూవుంటారు; కాని తెరవెనుక నిశ్శబ్దంగా పనిచేసుకపోయే నిపుణుల సంగతి ఎవరైనా చెప్పందే తెలియదు మనకు.

అటువంటి కనుమరుగైన కళాకారుడు శ్రీ బట్టేపాటి దశరథరామిరెడ్డి. కోవూరు తాలూకా పార్లపల్లెకు చెందిన ఆయన 1958 లో సినిమారంగ ప్రవేశం చేశారట. డబ్బింగ్ చెప్పడం, ఆయననేర్చిన కళ. ఈ 30 ఏళ్ళలో దాదాపు 450 చిత్రాలలో అసంఖ్యాకమైన నటులకు గాత్రధారణ చేశారాయన.

ఆనాటి కృష్ణపాండవీయం, అమర శిల్పి జక్కనవంటి కళాత్మకమైనచిత్రాల నుంచి, నిన్నమొన్నటి ప్రతిఘటనలో కాళిపాత్రధారి చరణ్‌రాజ్‌వరకు, ఎందరో ఆయనగొంతు అరువుతీసుకుని, తెరపై ప్రేక్షకుల మన్ననలు పొందారు.

దశరథరామరెడ్డి వుండేది పార్లపల్లెలోనే; ఎవరికి ఎప్పుడు డబ్బింగ్ అవసరమైనా మద్రాసునుంచి మనిషినిపంపి పిలిపించుకుంటారట-దాన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. దశరథరామరెడ్డి గాత్రధారణలో ఎంతనేర్పరో.

# నెల్లూరు గుచ్ఛేళ్లు

విమర్శకుడు

## జి.వ. సస్పెన్షన్

కళాపరిషత్ సెక్రటరీ డాక్టర్ బాల చెన్నయ్యను ఆ పి పి తి ఆరోపణలతో సస్పెండ్ చేస్తూ, డిసెంబరు 27 తేదీ ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వు కాలపరిమితి నిన్నటితో ముగిసింది. ఇంకా రాష్ట్రప్రభుత్వ రికార్డుల్లో ఉన్నట్లు ... సస్పెన్షను మరో 3 నెలలపాటు పొడిగించారట.

హైకోర్టు స్టే రద్దు తర్వాత బాల చెన్నయ్య ఇక్కడికి రావాలో పోవాలో? ముఖం చూపించలేకనా? రాజకీయ సన్యాసమా?

## అడిషనల్ ఎస్. పి.

నెల్లూరు కొత్త అడిషనల్ ఎస్ పి.గా శ్రీ బి. కాశీనాథ్ నియమితులైనారు. ఆయన ఇదివరకు ఖమ్మం అడిషనల్ ఎస్ పి.గా పనిచేశారట; ఐ. పి. ఎస్. కాకుండా డైరెక్టు రిక్రూట్‌మెంట్‌లో నియమితులైన అధికారి చురుకైనవాడనే పేరుందట.

## కోర్టులో "హరిణి"

హరిణి సాంస్కృతిక సమాఖ్యవారి ఎగ్జిబిషన్ వ్యవహారం, దాని ప్రధాన నిర్వాహకుడు శ్రీ వి. మధుసూదనరెడ్డి మోసం ఎట్టకేలకు కోర్టుకెక్కింది.

An International Cultural Development Trust అని, కళానార్ట్ బిజినెస్ సర్వీసెస్ అనే పేరుతో మార్చి 1 తేదీనుండి ఏప్రిల్ 15 తేదీవరకు ఎ. సి. స్టేడియంలో ఎగ్జిబిషన్ జరుగు బ్రహ్మాండమైన ప్రచారంతో ప్రారంభించారు. స్టాల్స్ వాళ్ళ, జనంలేక ఈగలు ముసురుతూ నాలుగు రోజుల్లో అది బ్యాంకి అపరంలోకి షిఫ్ట్ కావడం పాఠకులకు తెలుసు.

బ్యాంకి అవరణంలోకూడా వారు ఆశించినట్లు స్టాల్సు గీల్సు రాలేదు; అన్ని రకాలు కూడా వున్నట్టులేదు: సాంస్కృతిక కార్యక్రమాలు అసలు సున్నా అనుకోండి; అయినా దీపకాంతులకు, మైకుహోరుకు భ్రమసి కాలక్షేపపు జనం తొంగిచూచి వస్తున్నట్లుంది.

ఇదిట్లావుంటే ఎగ్జిబిషన అధిపతి వేమారెడ్డి మధుసూదనరెడ్డిగారికి రూ. 10,700 లు సమర్పించుకొని మోసపోయానంటూ విజయప్రకాష్ అనేవ్యక్తి నెల్లూరు ప్రిన్సిపల్ జిల్లా మునిసిఫ్‌కోర్టులో దావావేశాడు. ఎగ్జిబిషన భాగస్వామ్యంలో డిపెజిట్లు లాభాలు వస్తాయని చెప్పాడని, తాను దఫాలు వారీగా మొత్తం రూ. 10 700 లు చెల్లించానని, ఆ మొత్తాలకు మధుసూదనరెడ్డి చిన్న కాగితంపెలికలమీద రసీదులిచ్చాడని, అనంతరం వ్యవహారాలమీద తనకు అనుమానంకలిగి తనడబ్బు తనకివ్వమని అడిగితే ఏమి చేసుకుంటావో చేసుకోపొమ్మని బెదరించాడని జయప్రకాష్ దావా అర్జీలో పేర్కొంటూ, తన తబ్బు తనకు ఇప్పించవలసిందిగా కోరాడు. జిల్లా మునిసిఫ్ శ్రీ ఎ. వర్మా శరరెడ్డిగారు దావాను స్వీకరించి, ఎగ్జిబిషన వసూళ్ళను ఏరోజుకారోజు కోర్టులో డిపాజిట్ చేయవలసిందిగా తాత్కాలిక వుత్తరువును జారీచేస్తూ, ఎ. రాధాకృష్ణమూర్తిగారిని కమీషనర్‌గా నియమించారు.

మొదటి రెండురోజుల కలెక్షన్లు కోర్టులో డిపాజిట్ చేయడం జరిగింది. ఈదావాలో జయప్రకాష్ పక్షంగా న్యాయవాది శ్రీ వై వెంకటశేషయ్య దావా దాఖలుచేశారు.

దీనిపై మధుసూదనరెడ్డి ఎగ్జిబిషన వసూళ్లకు తనతల్లిచేత పూచీ ఇప్పించగా, కోర్టుకమిషనర్‌ను రద్దుచేస్తూ 27 తేది వుత్తరువు చేసింది. దావా విచారణ 31 తేదికి వాయిదావేయబడివుంది.

## 7 తరగతి పరీక్షలు

టీచర్ల సమ్మెవల్ల వాయిదాపడిన 7వ తరగతి కామన్ పరీక్షలు ఏప్రెల్ 2 నుంచి 9 తేదివరకు జరుగుతాయని డి. ఇ. ఓ శ్రీ వై. మస్తానరెడ్డి ప్రకటించారు. ఒకటినుంచి 5 తరగతుల వరకు సంవత్సర పరీక్షలు 2 తేదినుంచి, 6, 8, 9 తరగతుల విద్యార్థులకు 5తేది నుంచి పరీక్షలు జరపాలని ఆయన ఉత్తర్వులు జారీచేశారు.

## ఆంధ్రా బ్యాంకుకు నూతన భవనం

ట్రంకురోడ్డు ఆంధ్రా బ్యాంకును నిర్మల రెస్టారెంట్ ప్రక్కన కట్టిన ఆకాశహర్మ్యమంతటి అధునాతన భవంతిలోకి మార్చారు. కొత్త భవనానికి 20 తేది సాయంత్రం బ్యాంకు ఛైర్మన్ శ్రీ వెంకటరత్నం రిబ్బను కత్తిరించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షించారు. భవన యజమాని శ్రీ సి. సి. సుబ్బరాయుడు, డాక్టర్ రవీంద్రరెడ్డి శ్రీమతి రేబాల దమయంతి తదితరులు మాట్లాడారు: బ్యాంకు రీజనల్ మేనేజర్ శ్రీ శ్రీహరిరావు, బ్రాంచి మేనేజర్ శ్రీ విష్ణువర్ధనరెడ్డి స్వాగతవందనాలు చెప్పారు.

1941లో ప్రారంభమైందట, నెల్లూరులో ఆంధ్రాబ్యాంకు. ఇప్పుడు ఈ బ్రాంచిలో 7 కోట్ల 30 లక్షల డిపాజిట్లున్నాయట. ఇచ్చిన అప్పులుమాత్రం

—కొరవ 9 పేజీలో

# పెండ్లిండ్లు

తార

### కృష్ణారెడ్డి కుమార్తె

యూత్‌కాంగ్రెస్ పాత్రికేయుడుగా, ఐ. యన్. టి. యు. సి. కార్మికనాయకుడుగా, బల్లగుర్తి గర్జించేవక్తగా, హైదరాబాదు ప్రింటింగు పారిశ్రామికుడుగా, ఛర్డుపల్లి కాంగ్రెస్‌వాదిగా జగమెరిగిన శ్రీ ఎల్ వి. కృష్ణారెడ్డి తన కుమార్తె విష్ణుప్రియకు; ఈదలవారిపాళెం శ్రీ కలికి రమణారెడ్డి కుమారుడు విజయులరెడ్డి ఎ. పి. ఎ. తో 20 తేది వేకువన వి. ఆర్. హైస్కూలు గ్రౌండులో వివాహం జరిపారు.

మనల్ని అంతదూరం తామందే హైదరాబాదుకు రమ్మనకుండా తానే మనమున్న నెల్లూరుకువచ్చిమనకూ ఆశీరక్షతలుచల్లే అవకాశం కల్పించినందుకు కృష్ణారెడ్డిని అభినందిద్దాం.

### శేషారెడ్డి బావమరిది

శాసనసభ్యులకు మానాగా వ్యవహరించిన సర్వేపల్లి మాజీ శాసనసభ్యుడు, ఎర్రజర్లరు కాంగ్రెస్‌వాది, అకుంఠిత ప్రజాసేవకుడు. క్రమశిక్షణగల 'సైనికుడు' శ్రీ సి. వి. శేషారెడ్డి తన బావమరది మారు వెంకటసుబ్బారెడ్డికి (పంటపాళెం): సోమరాజుపల్లి శ్రీ దేవిరెడ్డి రామచంద్రారెడ్డి కుమార్తె జ్యోతితో 21 తేది అనితాథియేటర్‌లో వివాహం జరిపారు

### మదనపల్లి పెండ్లి

నెల్లూరు ఇర్రిగేషన్‌శాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ ఎస్. వి. ఎన్. కుమార్ కుమార్తె మాధవీదేవి; మదనపల్లి కే. శే. ఆర్. డి. శంకరప్ప కుమారుడు డాక్టర్. దుర్గాప్రసాద్ ఎం. వి. ఎస్‌సి. వివాహం 24 తేది మదనపల్లిలో జరిగింది.

### హైదరాబాదు పెండ్లి

డిప్యూటీడైరెక్టరుగా జిల్లాలో వ్యవసాయశాఖను రైతులకు సన్నిహితంచేసి; తాను ఆఫీసులకు,ఆఫీసర్లకుకాకుండా పొలాలకు పైర్లకు రైతులకు సన్నిహితుడై కర్నూలులో జాయింట్ డైరెక్టరుగా రిటైరైన శ్రీ పి. బాలసుబ్రహ్మణ్యం కుమారుడు సుబ్రహ్మణ్య కుమార్; సికిందరాబాదు పారిశ్రామికుడు శ్రీ ఎస్. రాజాంకుమార్తె అనూరాధ వివాహం ఫిబ్రవరి 21 తేది హైదరాబాదు బర్కత్‌పురాలోని రాఘవేంద్రస్వామి కళ్యాణమండపంలో జరిగింది.

### బొంబాయిలో కావలి పెండ్లి

కావలి న్యాయవాది శ్రీ ఎం. కృష్ణమూర్తి తనయుడు, హైదరాబాదు అడ్వొకేటు ఎం. వి. సూర్యనారాయణ బొంబయి హైకోర్టుకు చెందిన శ్రీ పి.ఆర్. సంతానకృష్ణ తనయ కస్తూరి దుర్గ పురఫ్ కాంతి వివాహం 12 తేది బొంబయిలోని పుష్టికర్ కళ్యాణ కేంద్రంలో జరిగింది.

### ప్రత్తివారి పెండ్లి

పెద్దరెడ్ల మిత్రుడు,పాతకార్ల ఫ్రెండు, మెప్పించడంతప్ప నొప్పించడం ఎరుగని శ్రీ ప్రత్తి సూర్యనారాయణశెట్టి (సూరి) కుమారుడు నరసింహం; మద్రాసు-శ్రీకర్లపాటి శ్యామసుందర్ కుమార్తె సునంద వివాహం 17 తేదితిరుపతిలో జరిగింది.

### మూడు 'ఆర్'ల పెండ్లి

బెంగుళూరులో రెండు 'ఆర్'లపేరుతో మన నెల్లూరువారి హోటల్ బ్రహ్మాండంగా జరుగుతున్నది. 'ఆర్' అనేది అచ్చివచ్చిన అక్షరమో లేక మరి ఎవరి పేరుకైనా సంకేతమో తెలియదుగాని మైసూరులో మూడు 'ఆర్'లతో నెల్లూరీయుడే అయిన శ్రీ గాలి వెంకటప్పనాయుడు ఒకహోటల్‌నడుపుతున్నాడట. ఆ వెంకటప్పనాయుడు తనకుమారుడు రవిశంకర్‌కు; శ్రీ నంబూరు వెంకటకృష్ణయ్య కుమార్తె ప్రవీణతో 17 తేది దర్గామిట్ట వెంకటేశ్వర కళ్యాణమండపంలో వివాహంచేశారు.

### చిట్టమూరు పెండ్లి

రెవిన్యూమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఇష్టసఖుడైన శ్రీ గణపర్తి బలరామనాయుడుకుమార్తె పార్వతి;ప్రకాశం జిల్లా,మన్నేటికోటవాసి శ్రీ గద్దం శేషయ్యగారి కుమారుడు వీరరాఘవయ్య వివాహం 17తేది నెల్లూరు విజయమహల్‌లో జరిగింది.

### తలుపూరు పెండ్లి

తుమ్మల తలుపూరువాసి, పుట్టు కాంగ్రెస్ భక్తుడు వేలూరు ఈశ్వరయ్యనాయుడు మనుమడు, అంటే శ్రీ శంకరనాయుడు కుమారుడు రవి; పోలవరం, శ్రీ పెంచెలునాయుడు కుమార్తె విజయ వివాహం 18 తేది నెల్లూరు ఏనుగ సుందరరామరెడ్డి రోటరీ కళ్యాణ మండపంలో జరిగింది.

### పి. వి. కుమారుడు

ఆ పాతరోజుల్లో ఆనంవారి రాజకీయ తంత్రాంగపు సలహామండలి ప్రధాన సభ్యుడు, మునిసిపల్ రాజకీయవేత్త, ప్రస్తుతం విశ్రాంత జీవితాన్ని గడుపుతున్న మిత్రుడు శ్రీ పి. వి. సుబ్బారెడ్డి కుమారుడు రవిరాజా;బాలిరెడ్డిపాళెం; శ్రీ తూపిలి రమణారెడ్డి కుమార్తె సుమన వివాహం14తేది నెల్లూరు టవున్‌హాలులో జరిగింది.

### పామూరు పెండ్లి

'లాయర్' ఉద్యోగి శ్రీ జి. రత్నం 17 తేది పామూరు వధువు విశ్వనాథుని తులసిని పామూరులో జీవిత భాగస్వామిని చేసుకున్నాడు. శుభం!

### నాగప్రాసెస్ పెండ్లి

నెల్లూరుకు సుద్దమైన బ్లాకులతయారీ సౌకర్యాన్ని కల్గించి, నెల్లూరులో మొదటగా స్క్రీన్ ప్రింటింగును ప్రవేశపెట్టి అలవిగానిపనితో సతమతమవుతున్న స్వయం ప్రతిభాశాలి, సూక్ష్మగ్రాహి అయిన శ్రీ వాకా సుబ్బారెడ్డి తన బావమరది సాంబశివారెడ్డికి; నెల్లూరు స్వర్గీయ ఆనం బాలిరెడ్డి కుమార్తె రాజ్యలక్ష్మితో 17 తేది నెల్లూరు పాండురంగ అన్నదాన సమాజంలో వివాహం జరిపారు.

### పంచాగ్నుల పెండ్లి

బస్ ఓనర్ల (కె.వి.ఆర్.) వద్ద గుమాస్తాగా పనిచేసి, క్రమంగా తానే బస్‌యజమాని అయిన శ్రీ పంచాగ్నుల సత్యనారాయణ కుమారుడు వెంకటప్పయ్యకు; మూలాపేట, శ్రీ పెరేపు ప్రభాకర్ కుమార్తె సుజాతతో 16 తేది పాండురంగ అన్నదాన సమాజంలో పెండ్లి జరిగింది.

### కోటేశ్వరరావు కుమార్తె

కె.వి.ఆర్. వద్ద దీర్ఘకాలం అత్యంత విశ్వాసపాత్రంగా పనిచేసి సర్వప్రియుడైన శ్రీ కె కోటేశ్వరరావు కుమారుడు సురేష్‌బాబు; శ్రీ కె. ఆదిశేషయ్య కుమార్తె శివప్రసూనల పెండ్లి 13 తేది ఉస్మాన్‌సాహెబ్ పేట రామాలయంలో జరిగింది.

### బి.కాం.ల పెండ్లి

కోటవాసి, విద్యానగర్ కళాశాల లెక్చరర్ శ్రీ కేతంరెడ్డి వెంకటరమణారెడ్డి సోదరి ప్రసూన బి. కాం., గూడూరు శ్రీ వాకాటి గోపాలరెడ్డి కుమారుడు కృష్ణారెడ్డి బి. కాం. పెండ్లి 14 తేది గూడూరు మహిళామండలి భవనంలో జరిగింది.





### • నిర్యాణం •



జననం : 19-11-1929
మరణం : 20-3-1986

శ్రీమతి
**బొద్దికూర సావిత్రీదేవి**
20-3-86 గురువారం
వైకుంఠప్రాప్తి చెందిరి.
వారి కర్మకృతువులు
29-3-86 తేది శనివారం
నెల్లూరు లక్ష్మీనగర్ (కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు వెనుక) లోని మా స్వగృహమున జరుగును.

బి. సుబ్రహ్మణ్యం (భర్త (రిటైర్డ్ ప్రిన్సిపాల్)
డా॥ బి.వి.ఎస్.వి. ప్రసాద్ M.D. కుమారుడు
సిహెచ్.పద్మలోచన కుమార్తె
బి. జ్యోతి కోడలు
డా॥ సిహెచ్. కోటేశ్వరరావు, MBBS అల్లుడు.
మరియు మనుమలు

### ది నెల్లూరు కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లిమిటెడ్
నం. 2319
వార్డు నం. 16/230 & 231, రాయాజివీధి-నెల్లూరు

తేది 17-3-86

## ప్రకటన

ఇందుమూలమున యావన్మందికి తెలియజేయడమేమనగా నెల్లూరు టవున్ పోకూరువారి వీధి (ఎ సి. మార్కెటు ఎదురు) కాపురస్థులు దిగ్గుమాటి రాణి పురఫ్ మల్లికా రాణి W/o. రామస్వామిరెడ్డి. ఈ బ్యాంకునందు ఈ క్రింది షెడ్యూలు దాఖలా నకలు ఆస్తి పత్రములు (డాక్యుమెంటు నం. 1631/78) దాఖలుపరచి ఋణమునకు అప్పుకోరుచూ, ఒరిజినల్ ఆస్తి పత్రములు పోయినవని తెల్పియున్నారు. ఇందుకు సంబంధించి ప్రోనోటు బాకీలుగాగాని, చేపుడు అడుమానములుగాగాని. మరి ఏ ఇతర విధములుగా హక్కులు, ప్రథమ చార్జీలు కలిగియున్ననూ, ఈ బ్యాంకు వారికి ప్రచురణ తేది నుండి వారము రోజుల లోపల వ్రాతమూలకముగా తెలియపరచ కోరడమైనది.

– ఆస్తి షెడ్యూలు –

నెల్లూరు రి.డి. ఇలాకా నెల్లూరు టవున్ పెనుబర్తులవారి వీధి. మున్సిపల్ వార్డు నెం. 13, డోర్ నం. 306 గల మిద్దె యిల్లు చతుర్సరిహద్దులు తూ) ఎ. కృష్ణారావుగారి యిల్లు వెంబడి యీ యింటి స్వంతగోడ. ద) ఎ. కృష్ణారావు యింటికి యీ యింటికి మధ్య పుమ్మడి గోడ కొంత, పోకూరువారి సందులోకి పోవు దారి. ప) యం. పార్వతమ్మకు చెందిన E షెడ్యూలు దాఖలా యిల్లు కొంత, పుమ్మడిమెట్లు కొంత. ఉ) మీనాక్షమ్మ యిల్లు వెంబడి యీ యింటి స్వంతగోడ యీ యింటి తాలూకు రోడ్డు.

యీ హద్దులలోని 5 అంకణములు స్థలం యిందులోని మిద్దె యిల్లు 5 అంకణములు.

వేములపాటి అనంతరామయ్య
అధ్యక్షులు

# పినాకినీతీరం

(౨వ పేజీ తరువాయి)

కమిటీలో వారి దర్శనభాగ్యం లభిస్తే లభించవచ్చుగాని, ఆ హోదాలతో వుండ బోరు అంటారు జనం సంస్థాన ప్యాట్రన్ ముఖ్యులు ఆదిశేషారెడ్డిగారు ఆ హోదాలోనే వుండబోతారేమోనని కొందరిమాట. అటువంటి అనుమానాలకు ఆస్కారమేలేదని నాపూహ: అంత దృఢంగా అభిప్రాయ పడటానికి రెండు కారణాలున్నాయి. అవి పూహకు అందనివేమీకాదు!

వెంకటగిరిరాజాల నామినేషన్ సమస్య? అదొక సమస్యగా ఇంకా మిగిలి వున్నదంటారా? "ఝర్" అంటే తిరిగిచూడకుండా ఎదురుపడి పరుగెత్తే సరుకది: వెన్నుపూసలేని రాజాలు పుర్తనకు సాహసిస్తారని అనుకోలేము: అదిశేషారెడ్డిగారి పేరు వినబడితే రాజాల ఛాయకూడా వుండబోదు: అనుమానము వలదు!

ఇంతకూ ఆదిశేషారెడ్డి - భక్తవత్సలు రెడ్డిగారలుపోయి, వారి స్థానాలలో వివేకానంద రెడ్డి - సుందరరామరెడ్డి గారలు అలంకరించడంలోనా, లేక కమిటీ స్వరూపస్వభావాలలో ఏదైనా ఒలో మార్పేమైనా వుంటుందా? వుండవచ్చు: ఆ ఐదుగు బ్రాహ్మణు బదులు, జెలాయింపు అధికారం ఆ రెడ్డిగారికి సంక్రమింపబడవచ్చు. ఈ మార్పయినా సామాన్యమైందా - కలియుగం పోయి పరోకయుగం వచ్చినంత విశేషమైంది!

లోగడ ఒకతండ్రి కొడుకును ఆఖరు కోర్కె కోరాడట-"అబ్బ మేలనిపించరా కొడకా" అని! కొత్తకమిటీ వ్యవహారం ఆవిధంగా కాకూడదని కోరుకుందాం!

## గ్రంథచౌర్యం-

## హస్తకళే!

గ్రంథచౌర్యం- రమ్యమైన ఈ పేరు పాతదే: అందువల్ల ఆ దొంగతనం కొత్తదిగా వుండటానికి వీలులేదు. అసలు దీన్ని దొంగతనం అనడం మొరటుగావుంటుంది. వినడానికే కఠోరం! Handi crafts కి మన సర్కారువారు హస్తకళలు అని పేరు పెట్టుకున్నారు. పుస్తకాలు దొంగతనంకూడా చేతితో చేసేదికాబట్టి దీన్ని ఒక హస్తకళ అనడం ఏ రీత్యా చూచినా అనుచితం కాదు: పైగా సంస్కారవంతంగా, సంస్కృతంలో తిట్టినట్లు హుందాగావుంటుంది!

స్వర్గీయ నారపరెడ్డి రామరెడ్డి అముద్రిత కావ్యాలు ఎక్కడున్నవో బయటకు తీసి, వాటికి ఎవరైనా ముద్రణాభాగ్యం కల్పించగలిగితే బాగుంటుందని రెండు వారాల క్రితం ఈ శీర్షికలో నేను చేసిన అభ్యర్థనను ప్రస్తావిస్తూ ఒక మిత్రుడు ఫోనులో అన్నాడు-" ఇప్పుడు బయటకు తీయడమేమిటి: నేను, నా మిత్రులొకరు కలిసి టాక్సీ వేసుకొని నారపరెడ్డి చని పోయిన తర్వాత వారి ఇంద్రకూరుపోయి ఆయన పుస్తకాలన్నీ తెచ్చేశాం: నీకు తెలియదా?" అని ధోరణిగా దండకం చదివేశారు అంటే ఏ పదిపన్నెండేళ్ళక్రితమో నారపరెడ్డి అముద్రిత రచనలన్నీ ఆయన గదప దాటాయన్న మాట! తీసుకొని పద్యారు మంచిదే: కాని వాటిని ఏమి చేశారు? వెలుగులోకి తెచ్చారా? తేదగిన రచనలు వాటికి లభ్యమయ్యాయా? నాకు ఫోనుచేసిన వ్యక్తికి తెలిసిందిమాత్రం తెలుసు: తర్వాత వాటిగతి ఆయనకి తెలియదు.

నారపరెడ్డి కావ్యాలు ఐదారు అచ్చయ్యాయి-అశ్రుమాల, నావిణ, కవిత, రైతుగీత, మధువనం, మధుశాల.... వగైరా. వీటిప్రతులు ప్రస్తుతం చెలామణిలోలేవు. ముద్రణకు అర్హమైన రచనలు ఇంకెన్నో వుండివుండాలి. నారపరెడ్డి ఇంట్లో ఏమివుండినాయో, అవేమైనాయో తెచ్చినవారు చెప్పగలిగితే బాగుంటుంది. అంతేకాదు: నారపరెడ్డి వంటికవులకావ్యాల ప్రచురణకు సాహిత్యాభిమానులైన వదాన్యుల విరాళాలతో జిల్లాస్థాయిలో ఒక సంస్థ ఏర్పడితే ఎంత బాగుంటుంది?

గ్రంథచౌర్యమంటే గుర్తుకువస్తున్నది. అమధ్య ఒకస్నేహితుడు వ్రాశాడు- "రామానాయుడుగారి స్వదస్తూరితోవున్న ఆయన పాటలపుస్తకం ఒకటి నావద్ద వుంది. ఎక్కడనుండి వచ్చింది అని అడగకండి. రామానాయుడు గారి పాటలు పద్యాలు అచ్చువేసేటప్పుడు, అందులో నా వ్యాసాన్ని చేర్చాలి!" ఇదీ ఆ మిత్రుని జాబు: ఆ పరతులు, విమానాన్ని దారిమళ్ళించే వారిపరతులవలె వున్నాయంటారా? సదుద్దేశంతో కూడినవికాబట్టి ఆక్షేపించలేము.

గ్రంథాలయాల్లో, తమహోదా పలుకుబడులను బట్టి ఇతరచోట్ల ప్రవేశమున్న పెద్దమనుషులు, పరిశోధనపాకుతో విలువైన గ్రంథాలను, ఫైళ్ళను హస్తగతంచేసుకొనే హేయమైన ఈ చౌర్యానికి వొడిగడుతున్నారు. పురాతన గ్రంథాలయాలు చూడండి: ప్రస్తుతం లభ్యంగాని అపురూప గ్రంథం ఒక్కటీవుండదు. పత్రికల ఫైళ్ళు చూడండి ఎక్కడబట్టినా చిల్లులు!

ఈ దొంగల బారినుండి మన గ్రంథాలయాలలోని అపురూప గ్రంథాలకు, ఫైళ్ళ రచనలకు రక్షణ కావాలి. అందరూ పెద్దమనుషులు: ఎవర్ని అనుమానిస్తారు? ఎట్లా కావలా పెడతారు? సంకటమైన విషయం!

## జనని. జన్మభూమి

ఎక్కడుంటేఏమి? జనని, జన్మభూమి అయస్కాంతంవలె లాగుతుంటాయి. వాటితో వుండే ఆ అనుబంధం, ఆ మమకారం అనిర్వచనీయం!

హోటల్ వ్యాపారంలో, వంటలో పద్దెనలో దేశంలో మలయాళీలనుచెప్పి, తర్వాత ఇంకెవరైనా చెప్పాలి. ఆ రంగం వారి స్వంతం: అందులో వారు సిద్ధహస్తులు. ఎవరెస్టు శిఖరం మీదకు పోయినా ఒక ఉడిపి హోటల్ వుంటుంది: వేడి వేడి ఇడ్లీ సాంబారు, కాఫీ ప్రత్యక్షమవుతాయని కథలుగా చెప్పుకుంటాము. మలయాళీలు ఆ వ్యాపారంలో అంత సమర్థులని, దానికోసం ఎంత దూర తీరాలకు పోవడానికైనా వారు వెనుదీయరని భావం.

పూర్వం నెల్లూరు హోటల్ వ్యాపారమంతా వారిదే. అదేకాదు టీ బంకులు, వంటవాళ్ళు, సర్వర్లు అందరూ వాళ్ళే. ఈనాడుకూడా నెల్లూరులో మలయాళీల జనాభా షుమారుగానే వుంటుంది: స్వామి శరణం అయ్యప్పభక్తి మనకు వారినుండి సంక్రమించిందేగదా! యాభై ఏళ్ళకు ముందు విశ్రాంతి భవనానికి ప్రత్యేకంగా పిలిపించబడిన నారాయణనాయర్ నెల్లూరు హోటల్ సామ్రాజ్యానికి అధిపతిగా కొంతకాలం వెలుగొందాడు. ఆయనతోటి ఎందరో వచ్చారు: ఆయన స్థిరపడి ఎందరినో పిలిపించాడు: వారందరుకూడా హోటల్ యజమానులయ్యారు. అయితే చివరకు ఆయనమాత్రం మలబార్ చేరుకున్నాననుకొండి!

అట్లనే చంద్రభవన్ అధిపతి శ్రీ సుబ్రహ్మణ్య అయ్యర్. పాత పెద్దహోటళ్ళలో చంద్రభవన్ ఒకటి. మరో విశేషం- ఆదిఆనంవారి రాజకీయపుబునుపోరకేంద్రంగా వుండేది. దాని స్థాపకుడు సుబ్రహ్మణ్యఅయ్యర్ దాన్ని ప్రస్తుతపు భవనానికి మార్చి, కొంతకాలముండి, తమ్ముడు సూర్యనారాయణకిచ్చి, తాను స్వస్థానం చేరుకున్నాడు!

నెల్లూరుతో దాదాపు అర్ధశతాబ్దపు గాఢానుబంధం కలిగిన సూర్యనారాయణ తన కుమారుని పెండ్లి పాల్‌ఘాట్‌లో చేశాడని విన్నప్పుడు ఈ జ్ఞాపకాలు దొంతరులుగా దొర్లాయి. ఇన్ని సంవత్సరాల తర్వాత వీరు ఎందువల్ల నెల్లూరును స్థిరనివాసం చేసుకోలేకపోతున్నారు? ఇచ్చి పుచ్చుకోవడాలు ఇక్కడే ఎందుకు చేయలేకపోతున్నారు? ఈ ప్రశ్నలన్నీ పుత్పన్నమై, జనని జన్మభూమిశ్చ అనే నిత్యసత్యపు మాటను సమాధానంగా స్వీకరించవలసి వస్తున్నది.

ఇటువంటివారందరూ భాషా ప్రాంత భేదాలకు అతీతంగా ఎక్కడికక్కడ స్థిరపడి, అక్కడివారితో కలిసిపోతే ఎంత బాగుండును అనిపిస్తుంది. గొంతెమ్మ కోర్కె ఇది?

# షాబాను కేసు

(౫వపేజీ తరువాయి)

కొర్దాగా దేశాల న్యాయశాస్త్రాలు సవరణలకు గురైనాయి. అలాంటప్పుడు ఎన్నో శతాబ్దాలకుపూర్వం అప్పటి పరిస్థితులను బట్టి రూపొందించిన మహమ్మదీయ న్యాయశాస్త్రంలో, ఏమార్పు చేయకూడదన్న వాదన అర్థరహితం. న్యాయశాస్త్రాలు మానవశ్రేయస్సుకోసం రూపొందించబడినవి. వారి భావాలలో, వారు గౌరవించే విలువలలో, వారి సాంఘిక పరిస్థితులలో మార్పువచ్చినపుడు న్యాయశాస్త్రాలుసైతం అందుకు అనుగుణంగా మార్పుచెందడం సహజం.

దేశంలోని ప్రముఖ న్యాయవాదులు న్యాయశాస్త్ర కోవిదులు సమావేశమై ఈ బిల్లును గర్హించడం, బిల్లును వ్యతిరేకించమని పార్లమెంటు సభ్యులను కోరడం, ఒకవేళ బిల్లు శాసనమైతే అది రాజ్యాంగ విరుద్ధమని దానిని సుప్రీంకోర్టులో సవాలు చేయవలసిందిగా తీర్మానించడంజరిగింది. షాబాను కేసును సమర్థించడంలోనూ, బిల్లును వ్యతిరేకించడంలోనూ మాజీ సుప్రీంకోర్టు న్యాయమూర్తి, చరిత్రాత్మకమైన తన తీర్పులద్వారా సాంఘిక న్యాయాన్ని చేకూర్చుటకు నిరంతరం కృషిచేసిన వి. ఆర్. కృష్ణయ్యర్‌గారు ప్రముఖపాత్ర వహిస్తున్నారు. మరొక మాజీసుప్రీంకోర్టు న్యాయమూర్తి, ప్రస్తుతం పార్లమెంటు సభ్యుడు అయిన బహరుల్ ఇస్లామ్ ఈబిల్లును వ్యతిరేకించడం గమనార్హం. ఈబిల్లు శాసనమైతే మహమ్మదీయులలో విడాకులు ఎక్కువకాగలవని ఆయన అభిప్రాయం.

మనం 21 వ శతాబ్దంలో ప్రవేశించబోతున్నాం. కాబట్టి ప్రజలు అందుకు సన్నద్ధం కావాలని, సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో అందుకు అనుగుణమైన వాతావరణం సృష్టించబడాలని ప్రభుత్వం చెప్తున్నది. కాని ఈ బిల్లు దేశాన్ని 21 వ శతాబ్దానికి తీసుకువెళ్ళే బదులు తిరిగి, 19 వ శతాబ్దానికి నడిచేటట్లు చేస్తూంది. పురోగమనానికి బదులు తిరోగమనం జరుగుతుంది. ప్రగతికి బదులు తిరోగతి సంభవిస్తూంది.

# బంగారు స్మగ్లింగ్ కేసులో నటి కవిత తల్లి అరెస్టు!

సింగపూర్‌నుంచి మద్రాసుకు విమానంలో 8 లక్షల రూపాయల విలువ జేసే బంగారుకడ్డీలను దొంగరవాణా చేసిననేరంమీద నటి కవితతల్లి వెంకటరమణమ్మ (వయసు 50) తోపాటు కళావతి, ప్రసాద్ అనే మరో ఇద్దరు ఖైదు చేయబడ్డారు. వాషింగ్ మెషీనులో ఈ బంగారుకడ్డీలు దాచిపెట్టబడివున్నాయట. ఈ దొంగ బంగారు రవాణా కొంతకాలంగా సాగుతోందని కస్టమ్స్ శాఖ వారివద్ద స్వాధీనం చేసుకోబడ్డ కొన్ని దస్తావేజులమూలంగా తేలింది. ఈ నేరంలో మరికొందరు యువతులకు, చిన్నవేషాలువేసే సినిమా తారలకుకూడా సంబంధముందన్న విషయం కూడా బయటపడింది.

సింగపూర్‌లో ఒక నూనె కర్మాగారంలో పనిచేసే దశరథరాజ్ అనే యువకుడ్ని నటి కవిత రెండేళ్ళక్రితం వివాహంచేసుకుని సింగపూర్‌లో వుంటూంది.

**మా మద్రాసు సినీ ప్రతినిధి**

కూతుర్ని చూసివచ్చే మిషతో వెంకటరమణమ్మ పలుసార్లు మద్రాసునుంచి కొందరు యువతులతో సింగపూర్‌వెళ్ళి వస్తోంది. ఈమె మద్రాసు మాంబళం రైల్వేస్టేషన్‌వద్ద ఒక వీడియో లైబ్రరీని నడుపుతోంది. ఈమె తమ్ముడు శేఖర్, వంపిణీదారులు రత్నం, రజాక్ కుమ్మక్కై: కమల, గీత, పార్వతి, రత్నకుమారి, సీతామహలక్ష్మి, స్వర్ణమాల అనే అందమైన యువతులద్వారా ఈ దొంగరవాణా సాగిస్తున్నారట. దర్యాప్తు మూలంగా మరికొన్ని విషయాలు బయటపడగలవని కస్టమ్స్‌వారు భావిస్తున్నారు.

## ఏప్రెల్ 10న తిక్కవరపు సుబ్బరామరెడ్డి 'జీవనపోరాటం' విడుదల

చిత్రప్రదర్శనారంగంలో, పంపిణీరంగంతో సంబంధ బాంధవ్యాలున్న "కళాబంధు" తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి అందర్నీ ఆహ్లాదపరిచే అత్యుత్తమమైన చిత్రాలు నిర్మించాలన్న చిరకాల వాంఛ ఇంతకాలానికి తీరింది. ఆయన డి. రామానాయుడితోకలిసి తీసిన "దిల్ దివాలా" చిత్రం ఉత్తరభారతంలో సూపర్‌హిట్ అయింది. శ్రీ సురేష్ ఎంటర్‌ప్రైజెస్ పతాకంలో ఆయన సమర్పణలో పి. శశిభూషణ్ నిర్మాతగా వ్యవహరించిన "జీవనపోరాటం", మనోజ్‌కుమార్ చిత్రం "రోటీ కప్డా ఔర్ మకాన్"ను మన వాతావరణానికి అనుగుణంగా చేర్పులు మార్పులుచేసి, ఒరిజినల్‌చిత్రంకన్నా మిన్నగా తీశారు. తారాగణం: శోభన్‌బాబు, రజనీకాంత్, నరేష్, గుమ్మడి, రావు గోపాలరావు, శరత్‌బాబు, సత్యనారాయణ, విజయశాంతి, రాధిక, పుష్పలత, ఊర్వశి, 'ప్రతిఘటన' శ్రీనివాసరావు, ఈశ్వరరావు.

—తరువ 15 వ పేజీలో

## అరకు అందాల 'ఆలాపన'

ఉష, నర్తకి భారతీయ నృత్యాలన్నిటినీ మేళవించి ఒక నూతన నృత్యరీతిని అభినయించాలని ఆమెజీవితాశయం; కాని. ఒక దుస్వప్నం నుంచి దూరంగా పారిపోవలసివస్తుంది. అలా పారిపోతున్న ఉషను అరకులోయలో ఒక మధురమైన ఆలాపన విని, ఆగిపోయింది. ఆ ఆలాపన శివుడనే భావుకుడిది. అతనక్కడ రైల్వే ట్రాలీమన్‌గా పనిచేస్తున్నాడు. అతని ఊహల్లో ఓ సుందరి మెదలినప్పుడల్లా కంఠం విప్పి, ఆవేశంతో ఆలపిస్తూ ఉంటాడు. అతని గాన మాధుర్యానికి ఉష ముగ్ధురాలైంది. తనఊహాసుందరి సాక్షాత్కరించినందుకు శివుడు మురిసిపోతాడు. ఆమె ఆరాధించేది అతని గాత్రాన్నే గనుక అతని ప్రేమను తిరస్కరించి, తన నృత్య సాధనలో నిమగ్నురాలైపోతుంది.

శివుడి గానాన్ని సొమ్ము చేసుకోవాలని ఒక రికార్డ్ కంపెనీ ఓనరు మురారి ఆశపడతాడు. కాని ఎదురుగా ఉష వుంటేనే స్పందించి పాడగలడని తెలుసుకుంటాడు. ఉష డైరీ మూలంగా ఆమె గత జీవితం గురించి తెలుసుకుని, ఆమెను బెదిరిస్తాడు. వెనర్జీకి మురారి తోడయ్యాడు దాంతో కథ అనేక మలుపులు తిరుగుతుంది ముగింపు విస్మయం గొలుపుతుంది. ఇంత చక్కని కథను అంత చక్కగా తెరకు మలిచాడు డైరెక్టర్ వంశీ. కథ, స్క్రీన్‌ప్లేకూడా ఈయనే రాశాడు. అరకులోయ అందాలను కెమెరామన్ రఘు మనోహరంగా సెల్యులాయిడ్‌మీదికి ఎక్కించాడు. ఇళయరాజా సంగీతంలో సి. నారాయణరెడ్డి, వేటూరి పాటలు మళ్ళీ మళ్ళీ వినాలనిపించేలా ఉన్నాయి. హరిత చిత్రమూవీస్ "ఆలాపన" చిత్రంలో మోహన్, భానుప్రియ, జె. వి. సోమయాజులు, దేవదాస్ కనకాల, రాళ్ళపల్లి, ప్రదీప్ శక్తి, హేమసుందర్, వై. విజయ, రూప, మల్లికార్జునరావు, శీలానంద్, కృష్ణమూర్తి, శ్రీ గోపాల్, ఝాన్సి, శైలజ, రాంబాబు, పద్మనాభశాస్త్రి నటించారు. నిర్వహణ అల్లారెడ్డి జగన్మోహన్‌రెడ్డి. నిర్మాత పెళ్లకూరు అమరేంద్రరెడ్డి.

## ఏప్రెల్ 23న వేట

"ఖైదీ"ని మించిన స్థాయిలో నెల్లూరీయుడు డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి వేట చిత్రాన్ని తమ సంయుక్తామూవీస్ పతాకంలో నిర్మిస్తున్నారు. ఈ స్టూమ్ప్ కోసమే కొన్ని లక్షలు ఖర్చుపెట్టారు. ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వ ప్రతిభకు మరో తార్కాణమైన ఈచిత్రంలో బిగువైన కథ, రసవత్తరమైన సన్నివేశాలు గగుర్పాటు కలిగించే ఫైట్లు, నయనానందకరమైన నృత్యాలు, హాయిగొలిపే సంగీతం అదనపు ఆకర్షణలు. చిరంజీవి, జయసుధ, సుమలత, రంగనాథ్, జగ్గయ్య, నూతన్‌ప్రసాద్, మోహన్‌శర్మ, రాజ్‌వర్మ, రమణారెడ్డి, మాయా, వాణి పాత్రధారులు. మాటలు: పరుచూరి సోదరులు సంగీతం: చక్రవర్తి, కెమెరా: లోక్‌సింగ్, ఫైట్స్: విజయన్. ఈచిత్రంలో బెంగుళూరు, మైసూరు, తలకోన ప్రాంతాలలో జరిగిన ఔట్‌డోర్ షూటింగులు చాలా వెరైటీగా వున్నాయని రషెస్‌చూసినవారన్నారు. ఈచిత్రం వసూళ్ళలో "ఖైదీ"ని మించిపోవడం ఖాయం.

### మరోతార ఛత్రాన్ని నిరాకరించిన తార

మద్రాసులోని మిడ్‌లాండ్, లియో జంటథియేటర్లను జయప్రద కొన్నది. అక్కడ కొత్తగా విడుదలయ్యే చిత్రాలు ప్రదర్శింపబడుతుంటాయి. కాని, రజనీకాంత్ నటించిన "నాన్ అడిమై ఇల్లై" అనే తమిళ చిత్ర ప్రదర్శనకు జయప్రద అంగీకరించలేదు. అందుకు కారణం ఆ చిత్రంలో శ్రీదేవి హీరోయిన్ కావడమే!



'స్వాతిముత్యం'లో కమలహాసన్

## చార్లిచాప్లిన్ చిత్రాలకు పేలవమైన అనుకరణ స్వాతిముత్యం

**ఎస్. వి. ఎస్.**

కథకుడు దర్శకుడైతే ప్రయోజనం చేకూరవచ్చుగాని, దర్శకుడే కథకుడైతే అబంధరజరిగే అవకాశం ఎక్కువ. అందుకు ఉదాహరణ 'స్వాతిముత్యం'.

కమలహాసన్‌కోసం ఒకపాత్ర రూపొందించుకుని, తర్వాత దానిచుట్టూ అల్లినట్టుందీకథ. శివయ్య మానసిక వైకల్యం గల్గిన వ్యక్తి ('మందమతి' అనవచ్చేమో....). ఇలాంటి వ్యక్తుల ప్రవర్తన, స్వభావాలగురించి లోతైన అవగాహన లేనిదే వాళ్లపైన చిత్రంనిర్మించడం తగదు. విశ్వనాథ్ చేసిన పొరపాటు ఇదే. చార్లీ చాప్లిన్ తరహా పాత్రనొకదాన్ని తెలుగులో సృష్టించడానికి దర్శకుడు చేసిన విఫలయత్నం ఇది. చాప్లిన్ కేవలం నటుడుమాత్రమేకాదు, స్రష్ట. అతడు సృష్టించిన పాత్రలు అజరామరమైనవి. సమకాలీన జీవితాన్ని, ప్రపంచాన్ని ప్రతిబింబిస్తూ అతడు తీసిన చిత్రాలు నిజంగా స్వాతిముత్యాలు, అంతేగాని చాప్లిన్‌లాగా వదులు కోటు వేసుకొని, అస్తమానం గొడుగుపట్టుకున్నంతమాత్రాన కమలహాసన్ చాప్లిన్ అవుతాడా? కమలహాసన్ నటనా సామర్థ్యాన్ని తక్కువగా అంచనావేయడం నా అభిమతంకాదు. నిస్సందేహంగా అతడు గొప్పనటుడే. కాని, దర్శకుడికి తన హీరో (పాత్ర) గురించిన పూర్తి అవగాహన లేనప్పుడు. కనీసం కమలహాసన్ అయినా ఆపాత్రగురించి అధ్యయనం చేసివుండవచ్చు. అదీ జరగలేదు. అందుచేత శివయ్య ఒక్కోసారి అమాయకుడుగా ఒక్కోసారి అసమర్థుడుగా, ఒక్కోసారి ధైర్యశాలిగా....ఇలా రకరకాలుగా దర్శనమిస్తాడు.

ఏళ్ళొచ్చినా మనస్సు పెరగని వాళ్ళు మనకు ఎక్కడో ఒకచోట తారసపడుతూనేవుంటారు. కాని, వాళ్ళ వాళ్ళ కుటుంబసభ్యులు తమ దైనందిన జీవితంలో ఎదుర్కొనే సమస్యలను ఒక్కదాన్నయినా విశ్వనాథ్ సరిగా చూపగలిగాడా? బుద్ధిమాంద్యాన్ని గ్లామరైజ్ చేయడానికి, ఎంతసేపూ పూజలు, పునస్కారాలు, నిప్పుల గుండాల్లాంటి మూర్ఖవిశ్వాసాలను ప్రొజెక్ట్‌చేయడానికే తన శక్తినంతా ధారపోశాడు. శివయ్యకు పట్టుదల వుంది. బొమ్మ అంటే భయభక్తులూ వున్నాయి. అలాంటప్పుడు అతడిని ఎన్నడో దాదిలోపెట్టివుండవచ్చు. బొమ్మ అపని చేయమండానే కళ్ళుమూస్తుంది. ఇక లలిత- భర్తపోయాక అత్తగారిచేత అనాదరణకు గురిఅయిన అభాగ్యురాలు ఆమె పుట్టింట్లోనూ ఆమెను ఆదరించే తప్పు లేదు. తన సమస్యలకు పరిష్కారం గురించి ఏమన్నా ఆలోచించిందా?

—తరువ 15 వ పేజీలో

## నామాట

(4 పేజీ తరువాత)

తిరిగి ట్రాఫిక్ కంట్రోలర్ దారిలో పెట్టడానికి అక్కడ పోలీసులున్నా పైకారామూర్తి ఎవరైనా సరే రావాలి.

[illegible] ట్రాఫిక్ కంట్రోలు [illegible] అండర్‌బ్రిడ్జి [illegible] ట్రాఫిక్ అయింది. అయినా పోలీసులు కోవూరు నుంచి వచ్చే వాహనాలను ట్రాఫిక్ [illegible] పొమ్మంటున్నారు. [illegible] కారణం.

కోవూరు, జేమ్స్‌గార్డెన్ వైపునుంచి అండర్‌బ్రిడ్జి మీదుగా వెళ్ళే వాహనాలను ఐరెండేళ [illegible] లేకుండా నేరుగా వది లేయవచ్చు. కోవూరు నుంచి స్టోన్‌హౌస్ పేట వెళ్ళేవాహనాలకు కూడా [illegible] రాలు [illegible]. పేటనుంచి వచ్చే వి. జేమ్స్‌గార్డెన్ నుంచి పేటకు వెళ్ళే [illegible] కంట్రోలు చేయవలసి వుంటుంది. ఈ ఏర్పాటుచేస్తే మొత్తం ట్రాఫిక్ అదుపుకు ఒక్క కానిస్టేబుల్ [illegible] సరిపోతుంది.

పాతరోజుల్లో పోలీసు రికార్డు నేరప [illegible] కొంతమంది ద్వారా మంచి పేరు పొందేవారు; ఇప్పుడు అవి లేమి [illegible] చేయకపోవటం [illegible] ట్రాఫిక్ [illegible] [illegible] ద్వారా పేరు ప్రతిష్టలు పొందడానికి ప్రయత్నిస్తున్నారా [illegible]!

• • •

తెలుగుదేశం అధికారంలోకి వచ్చిన తర్వాత జిల్లా రాజకీయంలో కలకలం సృష్టించిన కొత్తతరం నాయకులు ఇటీవల [illegible] విశ్వాస [illegible] గారికి చేసిన దాన్యం. ఎమ్మెల్యే పదవి [illegible] ఫలించకుంటే, [illegible] గంగా ధరంగారు రెండేళ్ళపాటు జిల్లా రాజకీయాన్ని కొనగోటితో తిప్పారు [illegible] ఎమ్మెల్యేల నుంచి [illegible] తరగని. [illegible] నాయకులెవరూ లేరు [illegible] వైరాగి [illegible]. ముద్దరేని [illegible] కలిగించలేదు. ఆయన రాజకీయాధికారం ఎంతగా వేధులు మీరిందో అర్థం చేసుకోవచ్చు.

కాని ఆరునెలలు ఐవతల నెల్లూరులో ఆయన దర్శనభాగ్యమే కల్గడంలేదే. ఎందుల్ల? పేరైనా విన్పించడంలేదే. ఎయ్యది కారణంబు?

అన్నగారి అభిమాన పుత్రుడుగా, తానే జిల్లాకు ముఖ్యమంత్రిగా వెలిగిన రమేష్‌రెడ్డి రాజకీయజీవితంకూడా, గాలి తీసిన బెలూన్‌వలె చప్పబడిపోయినట్లుంది. ఏస్. పి., డి. ఎస్. పి. లనే శాసించేస్థాయికి ఎదిగిన ఆ యువకుడు సైగా ఇంటిపట్టునే వుంటున్నాడే ఎందుల్ల?

వీ ద్దరేగాదు-తప్పికారి చేజిక్కిన కౌన్సిలర్ పదవితప్ప మరేమీ పొందలేక పోయినా, మొన్నటిదాకా అందరినోటా నానిన వై. టి. నాయుడు; పదవిదిగగానే పత్తాలేకుండాపోయిన బాలచెన్నయ్య; రాష్ట్ర తెలుగు మహిళకే సారథ్యం వహించిన గిరిజాకుమారి, మునిసిపల్ వైస్ ఛైర్మన్ పదవి ఆశాగళస్తనమే అయినా, దాన్ని పట్టుకొని ముఖ్యమంత్రులందరి ఎదుటా ముప్పొద్దులా మెసలిన ఆనం వివేకానందరెడ్డి .... ఏరీ ....ఈ నాయకులందరూ ఎటుపోయిరి. ఏ అధ లవులో అరణ్యఅజ్ఞాతవాసాలకిక్ అనుభవిస్తుండిరి! పత్రికలలో పేరైనను విని పించుటలేదే! ★

## జనవాణి

(3వ పేజీ తరువాత)

దబాయింపుతో కొన్నిరోజుల వ్యవధి తర్వాత అరేపన్నులుదండిన సొర్వ శ్యాలుకూడా వున్నాయి. కనీసం ఈ సారైనా అటువంటి అవకతవకలు జరగ కుండా నివారించాలని కమీషనరుకు విజ్ఞప్తి.

నెల్లూరు -నెమలి రాధాకృష్ణయ్య. ★

## పదవీయోగం

(మొదటి పేజీ తరువాత)

రాజ్యసభ ఎన్నికలలో 'దొంగ'లను పట్టుకునే గూఢచారిత్వం నుంచి, ఎలక్షన్ ఏజెంట్‌వరకు సర్వం తానై నిర్వహించాడు దీనర్థం- ముఖ్యమంత్రే కాక, అయన ఎల్లుడుకూడా నారాయణపై కరుణ కటాక్ష వీక్షణాలు ప్రసరింపజేస్తున్నారని అనుకోవచ్చునేమో! అందువల్లే కొత్త మంత్రులలో ఆయన పేరు విన్పడుతుంది.

అయితే నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిని మంత్రివర్గం నుంచి తప్పించాలనే తలంపు ఎన్.టి.ఆర్. లో చాలాకాలంగా వుంది. కానీ. ఆయన్ను కదిలిస్తే కులం పేరుతో వ్యతిరేకత పెల్లుబికి వచ్చునని భయపడుతున్నారు అదీగాక, శ్రీనివాసులురెడ్డి వల్ల పార్టీకిగాని, ప్రభుత్వానికి కాని ఒనగూడే ఐమేజేమీలేదనే అభిప్రాయంకూడావుంది. అయినా ఆయన్ను తొలగించడానికి భయపడుతున్నారు.

శ్రీనివాసులురెడ్డిని తొలగించలేని పక్షంలో, రామనారాయణరెడ్డికి మంత్రిత్వం బదులు మరేదైనా పదవిని కట్టబెట్టే అవకాశాలు ఉన్నాయనికూడా ఊహాగానాలు సాగుతున్నాయి. ఆయన అదృష్టం ఎట్లావుందో మరి. ★

## రాయబారం

(మొదటి పేజీ తరువాత)

సంస్కృతి" నుంచి కాంగ్రెసు ఇంకా బయటపడలేదనే అభిప్రాయం ప్రజలలో ఏర్పడితే. ఎంత బలసమీకరణచేసినా ఎన్టీఆర్‌ను ఓడించడం కష్టమని. క్రాస్ ఓటర్లపై చర్య తీసుకుంటే ప్రజలలో పార్టీకి ఇమేజ్ పెరుగుతుందని. దీనివల్ల కల్గే నాయకుల నష్టం- విస్తృత ప్రాతి పదికపై లభించే ప్రజాభిమానంతో పోల్చి నప్పుడు చాలా స్వల్పమని ఆయన బల్లగుద్ది వాదిస్తున్నాడు.

ఇరుపక్షాలలో అవేశకావేశాలు పెరిగి పార్టీ బ్రతుకు బజారున పడకముందే ఏదొ ఒకటి చేయాలన్న రాజీవర్గానికి శ్రీ బాగారెడ్డి నాయకత్వం వహిస్తున్నారు. వెంగళరావును ఒప్పించడానికి వీరుచేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి.

అందువల్ల క్రాస్ ఓటర్లకు క్షమాభిక్ష ప్రసాదించమని కోరుతూ బాగారెడ్డి. మరి కొందరితోకలిసి ప్రధాని రాజీవ్‌గాంధీ వద్దకు రాయబారం వెళ్ళివున్నారు. రాష్ట్రంలో ప్రస్తుతంకాంగ్రెస్ ఎదుర్కొంటున్న క్లిష్టపరిస్థితులు పంచాయతీఎన్నికలదృష్ట్యా కాంగ్రెసువాదులనమైక్యతావసరం, రాయలసీమలో రాజశేఖరరెడ్డిని కోల్పోతే పార్టీకి జరిగే కష్టనష్టాలు, తదితరాలన్నింటిని ఆయన కేంద్రనాయకులకు నివేదించారట.

అయితే కేంద్రంలో వెంగళరావును సమర్థించే శివశంకర్ వంటి నాయకులు వీరిని ప్రతిఘటిస్తున్నారు. ఇప్పుడు అంతిమ నిర్ణయం ప్రధాని భుజస్కంధాలపై పడింది. ఆయన ఏమిచేస్తారో ఎవరూ వూహించలేకున్నారు. ★

## సంచాంగం

### మార్చి తిథులు

29 శని చవితి రా. 1-05 గం.వ.
30 ఆది పంచమి రా. 10-49 ,,
31 సోమ షష్టి రా. 8-10 ,,

### ఏప్రెల్ తిథులు

1 మంగళ సప్తమి రా. 5-53 ,,
2 బుధ అష్టమి వ. 3-38 ,,
3 గురు నవమి వ. 1-43 ,,
4 శుక్ర దశమి వ. 12-08 ,,

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి


## జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | 50-00 |
| ఆరునెలలకు | 26-00 |

# చిత్రపరిశ్రమ: ముఖ్యమంత్రి ఉపేక్ష

నిర్వహణ: ... శ్రీకృష్ణ, ప్రసాద బాబు, ఉష, దేవి, పి. యల్. నారాయణ, రాంబాబు నటించారు. మాటలు: గణేశ్‌పాత్రో. పాటలు: సి. నారాయణరెడ్డి, వేటూరి సుందరరామమూర్తి. సంగీతం: చక్రవర్తి. కెమెరా: తివారి. ఆర్ట్: భాస్కరరాజు. ఎడిటింగ్: డి. రాజగోపాల్. నిర్మాణ పర్యవేక్షణ: వి సుబ్బరాజు. దర్శకత్వం: రాజాచంద్ర.

సుబ్బరామిరెడ్డికి విశాఖపట్టణంలో అత్యాధునికమైన స్టూడియోను నిర్మించాలనే తలంపువుంది. అదికూడా త్వరలోనే నెరవేరుతుందని ఆశిద్దాం.

## హైదరాబాద్‌లో చిత్రపరిశ్రమ ఇంకేం బాగుపడుతుంది?

కర్నాటకలో సినిమాలు నిర్మించే వారికి అక్కడి ప్రభుత్వం ఒకచిత్రానికి రెండున్నరలక్షల రూపాయలను సబ్సిడీ రూపంలోను, చిత్రం విడుదలయ్యాక యాభైశాతం వినోదపు పన్నులో రాయితీ రూపంలోనూ ఇస్తూంది. ఇంత ఆకర్షణీయంగా సౌకర్యాలు కల్పించి, ప్రోత్సహిస్తోందికాబట్టి, కర్నాటకలో చిత్రనిర్మాణం ఎక్కువగా జరుగుతోంది. కొందరు తెలుగు నిర్మాతలుకూడా బెంగుళూరు, మైసూరు నగరాలలో తమ్మత చిత్రాలు తీసి, రాయితీలు ఆర్జిస్తున్నారు. కాని, మన రాష్ట్రప్రభుత్వం అట్టి సబ్సిడీ ఇవ్వదు. అది నిర్మాతలకు సకాలంలో అందదు. అసలు ప్రభుత్వం ఏవిధమైన ప్రాథమిక సౌకర్యాలనూ కల్పించలేదు.

సినిమా వార్తలు
(11వ పేజి తరువాయి)

హైదరాబాదులో చిత్రాలు తీసేవారికి అదనంగా మూడు నుంచి నాలుగులక్షల రూపాయలు ఖర్చవుతూంది. ఈ విషయం మన ముఖ్యమంత్రికి తెలియనిది కాదు. ఆయన నిమ్మకు నీరెత్తినట్లు వుండడంతో నిర్మాతలు హైదరాబాద్‌లో చిత్రనిర్మాణం సాగించడానికి జడుస్తున్నారు. ఏ చలనచిత్రసీమ నుంచి నేను ఈస్థితికివచ్చానో – చలనచిత్ర సీమపట్ల మన ముఖ్యమంత్రి ఉపేక్షించడం ఎంతమాత్రం తగదు.

## జయసుధ మాజీ భర్త కె. రాజేంద్రప్రసాద్ ఖైదు

రాజ్యసభ ఎన్నికలలో సర్వారాయుడు చౌదరికి ఓటు వేయడానికి యాభైవేల రూపాయలతో ప్రలోభపరిచారని ఆరోపింపబడ్డ శాసనసభ్యుడు శ్రీ కె. సత్యనారాయణ చేసిన ఫిర్యాదు పురస్కరించుకొని అఫ్జల్‌గంజ్ పోలీసువారు వలపన్ని పట్టుకున్న వ్యక్తి లో జయసుధ మాజీ భర్త కె. రాజేంద్ర ప్రసాద్.

## ఏమిటో చిత్రాల పేర్లు

రిజిస్టర్ అయిన కొన్ని చిత్రాలపేర్లు ఎంతో తమాషాగా వున్నాయి. సింహపురి క్రియేషన్ "ముఖ్యమంత్రి జిందాబాద్", శ్రీ గణపతి సచ్చిదానంద ప్రొడక్షన్స్ 'కులాల కురుక్షేత్రం', శ్వేత చిత్ర ఇంటర్నేషనల్ 'పారిపోయిన పతివ్రతలు', నవజ్యోతి ప్రొడక్షన్స్ 'అర్ధరాత్రి అనుగ్రహం' సుచిత్రాఆర్ట్ క్రియేషన్స్ 'ఆషాఢమాసం', పద్మశ్రీ ఆర్ట్ పిక్చర్స్ 'బజారుబ్రతుకులు'.

ఇటీవల నెల్లూరులో జరిగిన నెహ్రూ ఉత్సవాలలో, ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకుడు పురాణం సుబ్రహ్మణ్యశర్మను సన్మానిస్తున్న నెల్లూరు డి.ఎస్.పి. లక్ష్మణ్ మోహన్, సుందరరామరెడ్డి.

స్వాతిముత్యం
(18వ పేజి తరువాయి)

లేదు. ఒక తెలివితక్కువవాడు కష్టాల కడలిని దాటేందుకై దేవాలయం మెట్లు కడగమంటే, కడిగికడిగి నవ్వుపాలిప్పోతుంది. అదేవ్యక్తివచ్చి అకస్మాత్తుగా మెడలోతాళికడితే, కిమ్మనకుండా కట్టించుకుంటుంది. స్త్రీకి ఆలంబన కావాలి. సరే, ఇదా ఆలంబన? ఇదా దర్శకుడి పరిణతి? తోడుకోసం పిచ్చివాణ్ణి కట్టుకుంటేమానె, నేర్పుగా ఏదన్నా పనిలోపెట్టి సంస్కరించుకునే చాతుర్యతలేదూ లలితకి? ఎదురింటి జులాయి ఒకడువచ్చి శివయ్యను ముస్తైతుకోమని, రజక దంపతులు ఏదన్నా పనిగూనుకోమని సలహాఇస్తారు; కాని, లలిత ఆపనిగూడా చెయ్యదు. ఇక లలిత మామగారువచ్చి లలితనుండి శివయ్యను వేరుచేయడానికి ప్రయత్నించడం "మేరానామ్ జోకర్" లాంటిదే. బలమైన డ్రామావున్న ఇతివృత్తాన్ని విశ్వనాథ్ పకడ్బందీగా మలచుకోలేకపోయాడు. సుత్తి వీరభద్రరావు దంపతుల మధ్య మామగారి గోల ఇదివరకటి 'వాన్నాదర్శలు'లో రమణారెడ్డి సంధ్య-చరలవాడల ప్రహసనానికి పేలవమైన అనుకరణ. బొమ్మగా నిర్మలకు ఈ మాదిరిపాత్రలు కొట్టినపిండి. దీపస్నానపట్టం ఎందుకు చెప్పండి. నేలబారు ప్రేక్షకోసం కాకపోతే? గొల్లపూడి పాత్ర బావుంది. ఆకట్టి శివయ్య దాఃగొట్టాక ఆకేసు ఏమైనట్టు? చిత్రంలో మనకు మరపురానివల్లా అద్భుతమైన లొకేషన్స్. వాటిని కట్టిబంధించిన రఘు ఛాయాగ్రహణం. ఇళయరాజా సంగీతం ఎక్కడా తెలుగుదనంలేకుండా అరవానన కొడుతూంది. మహదేవశలాగా పాటకు బాణీకట్టకుండా, ట్యూనుకు పాటరాసే సంప్రదాయం మరి, ఏంచేద్దాం! సుశీల గాత్రంలో ప్రాణంపోసుకున్న లాలిపాట సాహిత్యం బావుంది. చిత్రంచూసి బయటికివస్తుంటే అనిపించకమానదు, తెలివితక్కువ భర్తను దారికితెచ్చిన 'అర్ధాంగి' (స్వయంసిద్ధ) ఇంతకంటే బాగుందికదా! అని. ★




నెల్లూరు: శ్రీ సాయిబాబా పిక్చర్స్ (నెల్లూరు) చిత్తూరు: శ్రీ వెంకటకృష్ణా ఫిలిమ్స్ (తిరుపతి). సీడెడ్: రూపాఫిలిమ్స్ (గుంతకల్లు)
తూ॥ గోదావరి: శ్రీ లక్ష్మి మూవీస్ (రాజమండ్రి), శ్రీకాకుళం, విశాఖపట్నం: విజయలక్ష్మి ఫిలిమ్స్: (విశాఖపట్నం)
మైసూరు యస్. పి. ఎంటర్ ప్రైజెస్ [బెంగుళూరు]

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామమూర్తి, జమీన్‌రైతు ప్రెస్, 17/170, తిప్పరాజువారి వీధి, నెల్లూరు—524001